# PERMANENT ECONOMY

## PART II

# శాశ్వత పరిపోషణ

## రెండవ భాగము

BY

J. C. KUMARAPPA M. A., Ph. D.,

*RENDERED INTO TELUGU*

BY

SWAMI TATWANANDA




The Orient Publishing Co., (Regd.)

MADRAS :: TENALI :: SECUNDERABAD

Copyright ] 1950 [ Price : Rs. 1—0—0

# శాశ్వత పరిపోషణ

## రెండవ భాగము

( డాక్టరు జె. సి. కుమారప్ప రచియించి )
తత్వానందస్వామి తెలుగున ననువదించినది.

* * * * *

శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారి పరిచయ వాక్యముతో







దీ ఓరియంటల్ పబ్లిషిఙ్ కంపెనీ (రిజిష్టర్డు)

మద్రాసు :: తెనాలి :: సికింద్రాబాదు

కాపీరైట్ ] 1950 వెల : రు. 1-0-0

# ప రి చ య ము

ఈ గ్రంథము లోకకళ్యాణ ప్రదమగు "శాశ్వతపరిపోషణ". దీని రచయిత సుప్రసిద్ధ గాంధితత్వ వ్యాఖ్యాత, అనుష్ఠాత, అహింసవిప్లవకారయిత అగు శ్రీ జె సి. కుమారప్పాజీ! అనువాదకర్త విద్యావేత్త, సర్వసంగపరిత్యాగి అగు తత్వానందజీ. ఉభయులు గాంధీనాయకత్వమున జరిగిన స్వతంత్రసంగ్రామములో పాల్గొని జయముపొందిన స్వరాజ్యయోధులు. ఉభయుల ఉద్దేశ్యము సర్వజనక్షేమాభివృద్ధి. కాననే సర్వోదయ పరమసాధనము లన్వేషించి, స్వీకరించి ప్రకటించుటకు పూనుకొనిరి ఈ పూజ్యులిద్దరును.

ఈ గ్రంథములోని ప్రథమ సంపుటమునకు కాంగ్రెసు అధ్యక్షులు, ప్రజ్ఞావంతులు నగు డాక్టరు పట్టాభిసీతారామయ్య గారు తొలిపలుకు వ్రాసిరి.

ఈ ద్వితీయ సంపుటమును ఆంధ్రదేశమునకు పరిచయ మొనర్చు అవకాశము కలిగినందుకు నేను కృతజ్ఞుడను. ఆంధ్ర భాషాజ్ఞానము కలవారందరును దీనిని సాకల్యముగా చదివి, యోజించి, ఆచరింతురని ఆసించెద. ఆంగ్ల పరిచయము కల వారు ఆ భాషలో పఠించి దాని సారమును అనువాదములో గూడ ఆస్వాదించునట్లు తత్వానందజీ కృషిచేసిరి. వయోవృద్ధులయ్యు ఉత్తమప్రచారమునకు తోడ్పడుచున్న స్వామీజీకి ఆంధ్రులు కృతజ్ఞులుగా నుందురుగాక! ఆరోగ్య, ఆయుర్దాయ

ములను దైవము స్వామీజీకి ప్రసాదించి ఇతోధిక ఆంధ్రసేవ చేయునట్లు అనుగ్రహించుగాక!

భారతసమ్మేళన అమాత్యశేఖరుడగు శ్రీ జవహార్‌లాల్ జన్మదివసమున దీనిని లిఖించుటగూడ శుభచిహ్నమే !

వినయాశ్రమము, ౨౩—౩—౪ } (Sd.) సీ తా రాం

మకాం: కొవ్వూరు. పశ్చిమగోదావరిజిల్లా.

కార్తిక శుద్ధపంచమి జయవారం, ౧౪—౧౧—౫౦.

# ఒక మనవి

భారతీయుల కీనాడు స్వతంత్రత, స్వారాజ్యము లభించెను. గాని శాంతిభద్రతలు చేకూరలేదనుచున్నారు. ఇందుకు కారణము లనేకములుగా పేర్కొనఁబడుచున్నవి. నలుబదేండ్ల క్రిందట జపాను దేశప్రభుత్వమువారిచేత నొకసర్వకళాశాలా విద్యార్థి, చారిత్రక పరిశోధకుడు, మన దేశపరిస్థితులఁ బరిశీలించి, రాజ్యాంగధర్మములఁ గుఱించి యొక నివేదికను సిద్ధముచేయుట కొఱకై యిక్కడికి బంపబడెను. ఆయన తెనాలి హైస్కూలును దర్శించి ప్రతితరగతికినిపోయి 'ఈ దేశమెవరిది?' అని ప్రశ్నించినాడు. కొంతమంది విద్యార్థులు ఈ దేశము బ్రిటిషు చక్రవర్తిదనిరి; కొందఱు ఆంగ్లేయులదనిరి; కొందఱు వైస్రాయిదనిరి; కొందఱు ఇంగ్లీషుప్రభుత్వమువారిదనిరి. ఇట్టి యుత్తరములనే యెల్లరును తెలిపిరి. జాపానీయున కివేవియు నచ్చలేదు. తుదకాపాఠశాలావరణయం దొక సభ జరిగినది. ఆసభయం దాతఁడుపన్యసించుచు, ఇండియాలో తాను దర్శించిన ఏపాఠశాలలోను చరిత్రను గుఱించిన ప్రథమపాఠము నేర్పబడుట లేదనెను. తన దేశములో నే బడికిపోయి 'ఈ దేశమెవరిది?' అని ప్రశ్నించినను, ప్రతి విద్యార్థియు "నాది" అని జవాబీయు ననెను.

దీని యర్థమేమి? ప్రతి పౌరుడును దేశమును సమిష్టినే గాక, వ్యష్టినికూడ తన దేననియు, దాని యందలి భోగభాగ్యములు తనవనియు, వాని ననుభవించుటలో తన కెంత హక్కు గలదో వానిని సంరక్షించుట యందును, పెంపొందించుట యందును తన కంత బాధ్యతకలదనియు భావింపవలయును.

మన పాఠశాలలందును, కళాశాలలందును కూడ, ఈ నాటికిని ఈ భావములు నేర్పబడుట లేదు. సంఘములోని పెద్దలకును ఈ భావములు మనస్సున నాటినటుల లేదు. అట్టి యభిప్రాయము ప్రజలందు గానరాకుండుట యబ్బురము కాదు. నిందాస్తుతుల కన్నిటికిని ప్రభుత్వమే బాధ్యతగలదని యెంచ బడుచున్నది. రాజ్యమనగా రాజుయొక్కయు, వానియుద్యోగి గణముయొక్కయు అధికారముచెల్లు క్షేత్రమనియో, లేక వారి పరిపాలనా విధానమనియో తలంపబడుచున్నది. ఇందు పౌరుల ప్రసక్తి స్ఫురింపదు. ఇది పరిపాలనా విధాన ఫలితము.

నేడు మన స్వరాజ్యము స్థాపింపబడినదని చెప్పుకొను చుంటిమి. స్వరాజ్యమనగా ఒకజాతియందలి వ్యష్టిమానవు లందఱి స్వకీయ రాజ్యము లేక పరిపాలనము అనిభావము. ఈ స్వరాజ్యము అత్యంత ప్రతికూల పరిస్థితులందు సయితము వాని నెదిరించి పోరగల పౌరుల బలముమీద, స్వంతబాధ్యత మీద నాధారపడియుండునని గాంధీజి తెలిపియున్నాడు. కాని యీ భావమును ప్రజలు గ్రహింపజాలకున్నారు. కొలదిమంది జాతీయ నాయకులు తీవ్రప్రచారములు సాగించుచునేయున్నను పూర్వపు పరిపాలకులు ప్రజలలో లోతుగ నాటిన భావములు ప్రత్యంశమునందును అడ్డుదగులుచున్నవి. ఇంతకు పూర్వము మనకు గఱపబడిన నాగరికత పండి, అటుల దృఢపడిపోయినది. బానిసలకు సొంతబ్రతుకు, స్వంతయోచన యనునవి యుండవు గదా ? దేశపరిపాలనా విధానము పూర్తిగ పరదేశీయుల హస్తగతమై పోయినది. దేశాభ్యుదయ పోషణకు కర్తలు వారైరి. ఆర్థిక సంపద యిట్టి రూపముదాల్చి యిట్లు సమకూర

వలయునని నిర్ణయించు. నేతలు వారైరి. ప్రజల అభీష్టములకు తీఱులుదిద్ది, వేషభాషల రూపించువారును పరప్రభువులేయైరి. నానావిధ వస్తురాసులు విదేశములనుండి వచ్చిపడుచుండ, అవి మన కనుకూలములు కాకున్నను వాని వినియోగమున కనుకూలముగ ప్రజలే మారవలసిన వారలైరి. వాస్తురచనలను సిద్ధముచేయు శిల్పులు సయితము స్వతంత్రాదర్శముల గట్టిపెట్టి విజాతీయములగు తీఱుల ననుకరింపవలసిన వారైరి. వర్తకపు దారు లన్నియు విలాతివారి చేతులలో చిక్కిపోయినవి. ఇంత యేల మనకృషీవలులును దూరాన్యదేశప్రజల క్షేమము కొఱకే క్షేత్రకృషి నడుపవలసిన వారైరి. జనసామాన్యమునకు మార్గదర్శకులై సమిష్టిజీవనగతుల నేర్పవలసిన విద్యాప్రచారకులు విషమాదర్శములఁ జూపువారైరి. వీరును తాము కళాశాలలందు గఱచిన విద్యల ప్రభావము నెటుల తప్పించుకోగలరు ?

ఇట్టి ధశలో స్వరాజ్యము, స్వాతంత్ర్యము వచ్చినది. దీర్ఘకాలము మనస్సున జితించిన ఆదర్శము లొక్కసారిగ మార్పునందవు. ప్రధాన నాయకులు చెప్పున దిది : "మేము భారత జాతికి విలక్షణమైన ఆదర్శముల దెచ్చి పెట్టుటలేదు. కొలది కాలము — ఏ రెండు మూడు శతాబ్దుల కాలమో — మనల సమ్మోహనమున బడవైచి వికృతరీతుల నడిపిన విషమాదర్శముల దొలగించి, మన ఆర్యజాతికి విశిష్టములైన, ప్రాచీనాదర్శములనే పునఃప్రతిష్ఠింప జూచుచున్నాము. పడమటివారిచే తెచ్చిపెట్టబడిన నాగరికతచేత దేలినదికాదు. సమిష్టిగా నందఱి క్షేమముచు సంరక్షించునదికాదు. ఆ నాగరికత కింకను తరుణ

వయస్సైన్ననను గడువలేదు. ఇప్పుడిప్పుడే ప్రావిర్భవించిన యౌవ నోద్రేకమును తట్టుకోలేక తిప్పలు పడుచున్నది. స్థిరగతి లేనిది. ఎట్లో దాని నిర్బంధము తొలగినది. మన మొకింత వెనుదిరిగి చూచుకొనిన చాలును. మన దివ్యతరసంస్కృతి ప్రత్యక్షము కాగలదు. అయ్యది సహస్రాబ్దుల పరిశోధనలకు నిలిచి స్థిర పడిన గ్రామీణ జీవన విధానము. గ్రామీణ జీవన మనగనే హీనమగు పల్లెటూరి బ్రతుకని భ్రమింపకుడు. గ్రామమనగా శ్రేష్ఠము, శ్రేయస్కరము ననుభావమును సంస్మరింపుడు. మనలో మాననీయుని గ్రామణియందుము. పాశ్చాత్యులలో గొప్పవానిని ప్రభువందురు.

పాశ్చాత్యులు సామ్రాజ్య నిర్మాణమునకై ప్రయత్నించుటలో వైరములను, రణములను, పరధనాపహరణమును, అన్యజన వినాశమును సాధనములుగగొని కృతార్థులు కాలేక కుందుచుండిరి. వారి ప్రేరణశక్తి తృష్ణ. అదియున్న చోట స్వపరపక్షము లను భేదములేక యెల్లయనది యేడ్పించును. వారు నిర్మించు నగరుల అంతస్థులు వందల సంఖ్యకు మీరుచు గతిగానక దిగులు చెందుచున్నవి. మనపూర్వులును విశాల సామ్రాజ్యముల నిర్మింపయత్నించిరి. కాని వారు వైర భావ మును జూపక సౌహార్ద బుద్ధిని నుపయోగించిరి. ఎదుటివారి ప్రాణధనసంపదల హరింపఁజూడక, సమైక్య దృష్టితో మెలఁ గుచు విశాలతర రాజ్యమున భాగస్వాములైరి. ఒకవ్యక్తి యొక్కగాని, ఒక కూటమియొక్కగాని అధికారముగాదు ఆ వేర్వేఱు తెగలవారిని కలుపునది. మనవారు తమ సభ్యత్వ మును, విజ్ఞానమును, ఆనందమును పంచియిచ్చి, ఎదుటివారి

మైశ్వర్యములఁ దోచుకొనక, ప్రతిగ్రహ విధానమునగాక పరిధాన విధానమున, వారిం గలుపుకొని, వారితో గలిసి, తమ యుత్తమ సభ్యతకు వారిని వారసులనుగ స్వీకరించుచు వచ్చిరి. ఇందు తృష్ణలేదు. ఇరుగడల తృప్తియే. మనసామ్రాజ్య నిర్మాణమటుల నడిచినది. దీని నిదర్శనములను మధ్య అమెరికాలో సయితము పురా వస్తు వాస్తు పరిశోధకులు నేడుబయలు పెట్టుచున్నారు. ఈ గాథలఁ దెలుపుట మన పూర్వుల సమాధులను అస్థులను ద్రవ్వితీసి అభివర్ణించి ముతెసిపోవుట కుపకరింపదగదు. మనకు జీర్ణముగాని పాశ్చాత్య పరాపహరణ పథము నుండి మరలి, మనకు సర్వదా హితకరమైయొప్పు స్వార్థ పరార్థ ప్రాపక విధానమును తిరిగి చేబట్టి, ధన్యతగాంచు హెచ్చరిక గొలుపుటకొఱకే. వ్యష్టిగతముగను, సమిష్టిగను, జాతీయముగను విశ్వమానవ శ్రేణిలో శాశ్వతముగు అర్హస్థానమున నిలుచుత్రోవను జూపునిమిత్తమే సోదరుడు జె. సి. కుమారప్పగారు ఈ "శాశ్వతపరిపోషణ" Economy of Permanance) గ్రంథమును రచించి గాంధీజీ మెప్పు వడసియున్నారు. గ్రంథమంతయు సులభగ్రాహ్యములగు నుదాహరణలతో సమగ్రదృష్టితో కడుహృద్యముగ రచింపఁబడియున్నది. గ్రంథమందలి విషయముల వివరింపఁబూనుట తినబోవుతాయముల రుచిని వర్ణించుటవలె నుండును. కాన ఆ పొంతబోము.

ఒక్క విషయము ధృవము. ప్రస్తుతసమయమున భారతదేశాభ్యుదయమునకై పాటుపడు ప్రముఖ నాయకులును, ప్రచారకులును, విద్యావిధాన పాలకులును, విద్యార్థు

లును, ప్రజలును ఎల్లఱును ఈ యంశములగూర్చి విశదముగ తెలిసియుండి తీరవలయును. ఏ హైస్కూలు విడుచునే విద్యార్థియు వీనింగూర్చి అజ్ఞానిగ నుండదగదు. ఈ గ్రంథమును నా తెలుగు సోదరుల యెదుట నుంచునవకాశము లభించినందుల కెంతయు సంతసించుచున్నాడను."

"అసతోమా సద్గమయ"
"తమసో మా జ్యోతి ర్గమయ !"
"మృత్యోర్మాఽమృతం గమయ !"

తత్త్వానంద.
26-4-1950

# తొలి పలుకు

ఈ గ్రంథముయొక్క ప్రథమ భాగమున నరుని వ్యష్టిగ పరిగణనచేసి, ప్రత్యేక జీవిగ అత డెటుల వర్తించునో చూచితిమి. ప్రకృతి యెట్లు వర్తించునో గమనించితిమి. ప్రకృతియొక్కయు దాని చర్యలయొక్కయు పరిశీలనమే 'శాస్త్రము' (Science) అని గ్రహించితిమి. విశ్వము ననుగమించు పనిచేయుటయే శాస్త్రమునకు గమ్యార్థ మనియు గ్రహించితిమి. ఆ మార్గము నుండి యేమాత్రము తొలగినను హింసకును కల్లోలమునకును చిక్కిన వారమగుదుమని తెలిసికొంటిమి. జీవులనేకము నైజము చేతనే ప్రకృతి ననుసరించి వర్తించును. కాని నరుడో స్వతంత్రేచ్ఛయు బుద్ధియు కలవాడై యెంచుక గలిగి ప్రకృతితో సహకరించును. నిమ్నజాతి జీవులకును నరులకును మధ్యగల భేదమిదియే. నరుడు బుద్ధిపూర్వకముగ నవలంబించు జీవనగతిలో తన సమర్థతలను పెంపొందించుకొని వికసింపజేసికొనును. అప్పుడు తన కర్మము, కర్మఫలని ఫలమును అతడు నిర్ణయించుకొనుటకై వినియోగించు వివిధములగు ప్రమాణములను కనిపట్టియుంటిమి.

నరుడీ విధముగా వర్తించునపుడు ప్రపంచ సంగ్రామముల రూపమున తలయెత్తు వాటిల్లు సంక్షోభములను నివారింపగల శాశ్వత పరిపోషణమును రూపొందింప గల్గుచున్నాడు.

ఈ గ్రంథముయొక్క ద్వితీయ భాగమున నరుడు సంఘ జీవిగ నెటుల వెలయునో పరిశీలింతము.

జంతువులందునుగూడ, కొన్ని ప్రయోజనముల కొఱకై యేకరీతి జంతువులను గుమిగూడజేయు శక్తులను గమనింపగల్గుదుము. తోడేళ్లవంటి ఘాతుక జంతువులు, గుంపులుగగూడి వేటాడుచుండును. వాని ప్రయోజనము కేంద్రీకృతస్వార్థమే. జీవితమున నవి పరాన్న భుక్కులుగ నున్నవి.

ఇటుల గాకయు సమూహములుగగూడు జంతువులుగూడ గలవు. వీని ప్రయోజనము పరపీడనము కాదు; తఱచుగ పశుమందలు ఏనుగు గుంపులు

కేవలము ఆత్మరక్షణ కొఱకై యేర్పడుచున్నది. ఇకఁబోఁడను వ్యష్టిగ వానిని వేర్వేఱుచేసి చూచునెడల, ఆత్మరక్షణవాంఛతోపాటు వానికి స్వార్థప్రయోజనమునుకలదు. ఐనను సమష్టిగ గూడు నప్పుడు ప్రతివానికిని అన్నింటిని రక్షించు బాధ్యతయుగలదు.

ప్రథమ సంపుటములో మనము గమనించియున్నట్లు, పాశ్చాత్యుల సాంఘిక, ఆర్థికవ్యవస్థ, పరాన్నగ్రహణచింతగలదగుటచేత, నితరసంఘములకు తాము చేయగల అపకారము పైన వారి క్షేమ మమరియుండునుగాన, వారి సంఘమును పైన సూచించిన మూకజాతిలో చేరొనఁదగును. 'పరాన్నభుగళ' నుండి 'స్తేయ, సాహసదశల' ద్వారమున, మనము సమూహదశలోనికి పురోగమింపవచ్చును.

సమూహదశయందు, మనము గమనించియుండిన తీరున, రెండు రకములు కలవు. స్వత్వముపై నాధారపడు ఆర్థికనీతికి నిదర్శనమగు 'రుద్రజాతి' యొకటి; బాధ్యతపై నాధారపడు ఆర్థికనీతికి నిదర్శనమగు 'భద్రజాతి' రెండవది.

నరుడు పరిణతి గాంచిన కొలదిని, బాధ్యత (విధు) లం గూర్చిన వాని పరిజ్ఞానము వికాసము పొందును. తాను సంఘములో చేరినవాడగుటచేత తనకు రావలసిన లాభములను గుఱించి కాక, ఆ సంఘక్షేమమునకై తాను నిర్వహింపవలసిన బాధ్యతలం గుఱించి వాని కధికాధికముగ ఎఱుక గల్గును. తుదిదశయందు, అతడు 'సేవాపరిపోషణ' దశను ప్రాపించును. అప్పుడతడు ఇతరుల సేవయందే తాను ధన్యత గాంచు సదుపాయమున్నదని గ్రహించును.

ఈ గ్రంథభాగమునందు 'రుద్రజాతి' సమూహమును విడిచి, మానవజాతి సమష్టిక్షేమముకొఱకై, యితరులతోగూడి పాటుపడు మానవునిగూర్చి విచారింతము.

ప్రపంచమున కీనాడు ఇతరులకు వినాశముం గూర్చుకుండ, మానవజాతి యొక్క సామాన్యాభ్యుదయమును చేకూర్చుకొఱకు కలిసి పనిచేయు మఱొ

యమును దెలుపు విజ్ఞానము అవసరమగుచున్నది. ఈ పరిపోషణ విధానమున, మానవజాతిక్షేమము మెఱుంగులీను తళతళలతో ప్రత్యక్షము కాకపోవచ్చును; కాని అయ్యది శాశ్వతమై పఱగుట నిక్కువము.

పాశ్చాత్యుల 'రుద్రజాతి' సమూహార్థికనీతి వారి విధానము నవలంబించు నెడల, నేమియగునో దెలుపుటకొక నిదర్శనముగ నున్నది. 'రుద్రజాతి' సమూహముయొక్క పర్యవసాన మెట్లుండగలదో నిర్ణయించుటకు యూరపుఖండము ఈనాడే స్థితియందున్నదో చూడ కండ్లున్నవారు గుర్తించి గమనించిన చాలును. దాదాపు నూటయిరువదియేండ్లుగ అత్యధికోత్సాహముతో గావించిన అధికోత్పత్తి, ఆకలిమంట, బట్టకఱవు వాడుకవస్తువుల లేమిని తెచ్చిపెట్టినది. ఏమిచేయగవలయునో తెలియజాలక తనుకులాడుచు తలబాదుకొనుచు మానవులు గగ్గోలుపెట్టుచున్నారు. ఇక చచ్చిన కోట్లాది జనులగూర్చియు, గాలిలో బ్రేల్చివేయబడి నట్టియు, సముద్రమున ముంచివేయబడినట్టియు సంపదరాసుల గూర్చియు నెంచనేల? శాశ్వతపరిపోషణము సాధించుట మాత్రమే మన యీప్సితార్థము గావున, 'రుద్రజాతి' సమూహమునకు విముఖులమై, దానికి దూరులమైయుండుట మనవిధి. ఏమన 'రుద్రజాతి' సమూహములు వైరమును, వినాశనమును తెచ్చిపెట్టును. అదొక వేళ నొకింత విజృంభమాణమై గోచరించుగాక, తుదినది ఘోరానలకీలల బుగ్గ జేయగలదు. పర్యవసానమున నది చికిలింతైశ్వర్యమును జూపు నల్పకాల పరిపోషణమనక తీరదు. కావున ఈ తీరున పరిపోషణమును భారతదేశమున నిలిపి దాని చర్యను పరిశీలించు నిమిత్తమై, మన కాలమును మన యుత్సాహమును వ్యర్థము చేయుట యొప్పదు.

మనమట్టుకు శాశ్వత పరిపోషణమే మన పరమగమ్యము గావున, మనము జూడు సంఘమున సభ్యుడుగ నెట్లు వర్తింపవలయునో, అట్టి సంఘము శాశ్వతపరిపోషణమును బ్రాపింపగల్గుట కెట్టుల మెలగవలయునో తెలిసికొనవలసియున్నాము.

ఈ గ్రంథమున మొదటి భాగములో, సంఘమునందు వ్యక్తిమానవుని

చర్యను గమనించియుంటిమి. వినియోగదారుడుగ అతడు పాటింపదగిన ప్రమాణముల పరిశీలించియుంటిమి.

ఈ రెండవ భాగమున, ఉత్పత్తి కర్మయందును వస్తువుల పంపిణీయందును సంఘమునజేరి నరుడెట్లు వర్తింపవలయునో గమనింతము. సంఘజీవిగ నరుడు పాటుబడదగిన తీరులు మూడు కలవు. (1) కొన్నికొన్ని పనులందు, తనవంటి యితరులతోగూడి పనిచేయవలసినవాడుగ యున్నను, ఉత్పత్తి కర్మయందతడు వ్యష్టిగనే పనిచేయును. తోడివారితోగూడి నరుడు పడుపాటులోని యీ భాగము, వాని క్షేమమునకేగాక, తోడివారల క్షేమమునకును సంబంధించియుండి, మరియు పర్యవసానమున విశాలతర ప్రయోజనమును వానికి చేకూర్చును. (2) కావున ఒకేతీరు ప్రయోజనములుగలవారి సమూహములో చేరి సమష్టిగపాటుపడును. దీనిని 'సహకారక్రియ' యని పేర్కొందము. ఇయ్యది సమూహములో జరుగు రెండవ తీరుపాటుగనున్నది. (3) ఇక మూడవ రకపు పాటెట్టిదన; ఎచ్చట అల్పవ్యాప్తికర్మ వ్యష్టినరులకును, సహకారసంఘములకును నియమింపబడునో, ఆ సందర్భమున, దీర్ఘవ్యాప్తికర్మ నిస్స్వార్థపరులగు వ్యక్తులతో గూడిన సంఘములచేత నిర్వహింపబడవలయును. వీరు సమష్టిని సంఘమంతటి లాభము కొఱకును, కేవలము విధియను భావముతో పాటుబడుదురు. అటువంటి సంఘమును మనము 'ప్రభుత్వము'ని పేర్కొందము. ప్రస్తుతకాలమున ప్రపంచమున నేయెడను, ఇటువంటి బాధ్యతను పూనుకొనుట కర్హులగుచు, ఈ తరగతికి జెందినవ్యక్తి నరులతో నేర్పడిన ప్రభుత్వము కలదని వక్కాణింపగల్గుట కష్టము. ప్రస్తుతమున్న ప్రభుత్వము లన్నియు చాలవఱకు, సామాన్య నరునియెడ తమధర్మమును నిర్వహింప నోడుచున్నవి.

సమష్టిని సమూహమున కనుకూలించు ప్రణాళికను గుఱించి ముమ్ముందుగ విచారించి, ఆ పిమ్మట తమతోడి వారలతో గూడిన వ్యక్తులు తమపాటునెటుల నిర్వహింపనగునో ఆర్థిక దృష్టితో విచారింతము. ఆ పిమ్మట సహకారకర్మతో నిర్వహింపదగిన వేర్వేఱుధర్మములను, తుదిని ప్రభుత్వమెటుల

పాటుపడగల్గునో, ప్రజలు కష్టపడి సాధింపగోరు ప్రయోజనములకై ఆ ప్రభుత్వమేమి చేయవలసియుండునో విచారింతము.

ప్రథమ భాగములో మనము పరిశీలించియున్న ఆ యా ధర్మసూత్రములను దృష్టిలో నిడుకొనియే, యీ యంశముల నన్నిటిని విచారింపవలసియుండును. ఏమన ఆ సూత్రములన్నే, నరులు సమూహములుగ గూడినప్పుడు గూడ అనువర్తించి పాటుపడుచుండును.

ప్రథమ భాగము నందును ద్వితీయ భాగమునందును ప్రతిపాదింపబడిన ప్రణాళిక పూర్ణముగ నాచరణలో పెట్టబడునో తుదకది అహింసాపూర్వకమగు సంఘ నిర్మాణమును సుసాధ్యము చేయగలదు. ప్రాథమికావసరముల విచారించు నంతవఱకు అయ్యది ప్రజలకు సమృద్ధినొసగి జాతులమధ్య శాంతిని స్థాపించి శుభము చేకూర్చగలదు.

# వి ష య సూ చి క


| అధ్యాయము | విషయము | పుట |
| --- | --- | --- |
| 1. | పథకములు, వాని అవసరము, వాని స్వభావము | 1 |
| 2. | వ్యవసాయము | 11 |
| 3. | వినిమయము | 19 |
| 4. | సహకార ధర్మము | 22 |
| ,, | సహకార నీతి | 25 |
| 5. | గ్రామ పరిశ్రమలు | 33 |
| 6. | ప్రజాస్వామ్య పరిపాలనము | 47 |
| 7. | జాతీయ పరిశ్రమలు | 60 |
| 8. | ప్రభుత్వ ధర్మము | 68 |
| 9. | జీవితప్రయోగమైన విద్య | 74 |
| 10. | సామాజిక జీవితము | 94 |
| 11. | పురోగామి సంఘములు | 111 |

# శాశ్వత పరిపోషణ

## ద్వితీయ భాగము

### అధ్యాయము 1

### పథకములు : వాని అవసరము, వాని స్వభావము.

మన మసలు పథకములువేయు టెందులకు? జాతీయ పథక నిర్మాణ మనునది సాంకేతిక విద్యల నేర్చిన వారికిని నిపుణల కును మాత్రమే తెలియగల అత్యంత క్లిష్టమగు విషయ మని ప్రజ లనుకొనుచుండెడివారు. మనము రచించు పథకముల ప్రయోజనమును సామాన్య మానవుడు తెలిసికో వీలు లేని యడల ఆ పథకములు నిర్జీవము లనవలయును. వానియందు ప్రాణము లేనట్లే. జాతీయ ప్రయోజనము కొఱకని మన మేదేని పథకమును రచన చేయునప్పుడు, దాని ప్రయోజన మును మన రయితులు గ్రహింపజాలి, దానిని ఆచరణలో పెట్టుట యందు వారు మనస్పూర్తిగ సహకరింపజాలని యెడల, అయ్యది జాతీయ ప్రయోజనమున కగు పథక మనిపించు కొనదు. వారి బుద్ధికి నచ్చురీతిని మనము రచన చేయజాలిననే తప్ప మన మా పథకమును జయప్రదముగ కొనసాగింపలేము. లేదా రష్యాదేశమున జరిగినట్లు ఘోర హింసాకాండ సాగింప వలసినవార మగుదుము. మన పథకమును సాగించుటలో రక్తపు వెల్లువలకు కారణభూతులము కాగోరుకొనము గదా! మనము ప్రజల యెదుట పెట్టినది వారి క్షేమలాభముల కను పాలించున దగునా కాదా యని వారు గ్రహింపగలదిగ నుండవలయును. వారు దాని నంగీకరించిరా, వారి మనః పూర్వక మగు సహకారము మనకు లభింపగల్గును.

మన గ్రామములు హెచ్చు సౌఖ్యవంతములై, హెచ్చు సంపద తోడను జీవకళ తోడను చెన్నారుచుండ ప్రతి గ్రామీయుడును, వ్యక్తిగతముగను, చక్కని నిర్మాణము గల సమాజమున సభ్యుడుగను కూడ అభ్యున్నతి గాంచు సావకాశము గలిగి యుండవలయు ననుటే మన గ్రామ పునర్నిర్మాణోద్దేశ్యమై యున్నది. సహకార పద్ధతి ననుసరించి కూర్చబడిన ఆర్థిక రాజకీయ సాంఘిక క్షేత్రములందు సమకూర గలుగునంతగ స్థానిక సౌకర్యములను స్థానీయుల కార్యోత్సాహమును పూర్ణముగ వినియోగించుకొనుచు, మన మీ కార్యమును సాధింపవలసి యున్నాము. కావున గ్రామములలో ఉచిత నిర్మాణము గలిగి స్వావలంబన సమర్థమగు జీవనము నెలయుటే పథకరచనకు పరమార్థము. మనము స్థానికముగ ఏ కార్యక్రమమును పూనుకొనినను, అది యా స్థలమునకు మాత్రము శ్రేయోదాయకముగ నుండుటేగాక, మన సామాన్య పథక రచనాపద్ధతి కనుకూల పడునదిగను నుండవలయును. అట్టి కార్యక్రమము తుదకు న్యాయసమ్మతమును ప్రజాభ్యుదయ కరము నగు సామాజిక వ్యవస్థను నెలకొల్పుటకు దారి తీయునదిగ నుండవలయును.

పథక రచన యన నేమి ?

'పథక రచన' అనగ ఒకానొక గమ్యమును సాధించుట కనువగు అంశములను సమీకరించుట అని అర్థము. ఇటుల సమీకరింపవలసిన అంశములు భారతదేశమున నేవి గలవు ? ఇతర దేశములలో లేని యంశములు కొన్ని నేడు భారతదేశములో నుండవచ్చును. కాబట్టి రష్యా అవలంబించినటువంటి

పథకముగాని, లేక యింగ్లాండు, అమెరికాలు అవలంబించు చున్న పథకముగాని, మనము మన గమ్యమునకు చేర్చు పథకముగ నుండి తీరవలయు నను నియమ ముండ జాలదు.

దేని నేని 'బ్రిటిషువారి పథకము'ని పేర్కొను నెడల ఆశ్చర్యము తోచవచ్చును. అట్టిదానింగూర్చి ఆప్రజలు వినియుండరు. బ్రిటిషువారు పథకరచనలకై పెనగులాడరు; కాని వారును పథకాను సరణముగనే పాటుపడుదురు. అది ఆజాతివారి నైజమనీవ. ప్రతిపురుషుని ఏదోనొక పథకము ననుసరించునటుల వారు ప్రోత్సహింతురు. వారికి పథకము లనునవియే లేకుండెనేని, బ్రిటిషు సామ్రాజ్యముగాని, బ్రిటిషువాణిజ్యముగాని, సంభవమయ్యెడిదేకాదు. కావున వారి ఆర్థికప్రణాళిక లన్నియు వారి సామ్రాజ్యపు విశిష్టస్వత్వములన్నియు, వారినౌకాదళము, వారి నౌకా వ్యాపారనీతి ఇవన్నియుచేరి వారి పథక నిరూపణము గు నవచ్చును. దానినొక జాతీయ పథకమన చెల్లదేమో. అదొక లండను కేంద్ర విశిష్ట పథకము కానగును; లేక యింగ్లాండు బాంకు కేంద్రీకృత విశిష్ట పథకము కానోపును. ఐననేమి ? ప్రయోజనముంబట్టి అదొకపథకమే యన నగును.

కాబట్టి యీ పథకము లన్నియు—సోవియటు (రష్యా, పథకమైనను, లేదా బ్రిటిషు పథకమైనను, తమకు మూలాధారము లగు కొన్ని విశిష్టాంశములతో నొప్పుచున్నవి. కేవలము ఆ యంశములే కావలయునన్న మన దేశమున నవి లేకపోవచ్చును; ఆపరిస్థితులు మన దేశమున ప్రయోజనము లేనివిగనుండ వచ్చును. అట్లున్నను వారి పంథానే యనుసరించి మనము పథక రచనకు పూనుకొందు మేని మనకు భంగపాటు తప్పదు.

కార్యాచరణ పథకము :

భారతదేశమును దారిద్ర్యము, మాలిన్యము, రోగములు, అజ్ఞానము ననున వెన్నియో పీడించుచున్నవి. కావున మన పథకము నందీ కార్య ప్రణాళిక ముఖ్యావసరమైయున్నది.

1. వ్యవసాయము
2. గ్రామపరిశ్రమలు
3. గ్రామపారిశుద్ధ్యము, ఆరోగ్యము, గృహావసతి.
4. గ్రామవిద్య
5. గ్రామనిర్మాణము
6. గ్రామసంస్కృతి (culture)

లక్ష్యము :

రష్యావారు తమ పథక నిర్మాణము గావించిన తరిని ఆదేశము 'జారుల' నెడు నిరంకుశ ప్రభువుల పరిపాలనమున నున్నది'. శ్రీమంతులు భోగభాగ్యముల నోలలాడుచుండిరి; కృషికులు మిగుల పీడలపాలగు చుండిరి. సహజముగ ఆకృషికులిటుల తలపోయ నయ్యెను: "మేము అధికారము చేజిక్కించుకొనుచో, మేమును భోగభాగ్యముల నోలలాడ గల్గుదుము గదా!" భాగ్యమనగ అశేష వాంఛితార్థముల ననుభవింప గల్గుటే: రాజభవనములు, భౌతిక సంపత్సమృద్ధి, సుఖభోగములు, ఇంక నిట్టివన్నియు అవ్వారిగ కలిగియుండవచ్చును. ఇట్టి భావముతో తమలక్ష్యమును రూపించుకొనిరి. దానిని సాధించుకొటకై పాటుపడిరి. వారిదేశములో వారి పథకములు చక్కగ నాటుకొనినవి.

మనమును మన 'దారిద్ర్యము'ను రూపుమాపుకో గోరు చున్నామని పలుసార్లు పలుకుచున్నాము. కాని 'దారిద్ర్యము'న నేమిటో నిర్వచనము చేయవలసి యున్నాము. ఒకరిట్లను చున్నారు. "దారిద్ర్యమనగ అవసరముల దీర్చుకొనుశక్తి లోపించుట'. సరే. 'అవసర' మన నేమి? రోల్సురాయిస్ మోటారుకారు 'అవసర' వస్తువగునా? ఆ 'అవసరము' తీరని యెడల నీవు 'దరిద్రుడ'వేనా? ఒకవనిత పెదవులకు రంగు వేసికొను కణికను కొనుకోగోరును; అందుకు కావలసిన రొక్కమామె కడలేదు. అప్పుడామె 'దరిద్ర'యేనా? ప్రాథమికావసరములనబడు 'అవసరములు' కొన్ని యుండును; మఱియు కృత్రిమములగు 'అవసరములు'ను కలవు. వేనిలేమిచే నరుడు బ్రతుకవీలులేదో అట్టి 'అవసరములు'ను కలవు. తన వ్యక్తిత్వ ప్రకటనకును, తనభౌతిక శరీరమును నిలుపుకొనుటకును అవి తప్పక యుండవలయును. ఇవి సహజములగు 'అవసరములు'. వీనిని సమకూర్చుకొనుటకై ప్రయత్నముల చేయకతీరదు. కాని కల్పితములగు 'అవసరముల' దీర్చుకొనుటకు అట్టి యత్నము చేయు అగత్యముండదు.

'ప్రాథమికావసరములలో ముఖ్యమగున దేది? అందు మొదటిది తిండి. మనము గుడ్డలేకుండ తిరుగజాలుదుము; కాని తిండి లేనిది జరుగదు. మనదేశములో ఎన్నడెన్నడో వచ్చు కఱవులను గాక, పలుమారులు వచ్చు కఱవుల ననుభవించు చున్నాము. అందువలన మనపథకములో ఆ పరిస్థితిని చక్క జేయు ప్రయత్నముండి తీరవలయును. ఆహారము, కఱవుల నివారణ, వీనిని సాధించు టెట్లు? పెట్టుబడి ధనమును చేకూర్చుట

మూలమునకా ? చాలమంది యిట్లందురు. "పెట్టుబడిని హెచ్చుగ సమకూర్చుము; నీవు సాధించు ఫలము లెంతగనో అధిక మగును." ఎంత పెట్టుబడి పెట్టవలసి యుండునో, దానిమీద నూటికెంత యుత్పత్తి లభించునో గణితములు వేసి అర్థశాస్త్ర ప్రవీణులు తెలిపియున్నారు. పొలములలో ఇంతపెట్టుబడి సొమ్మును వెదజల్లినచో, ఇంతపంట పండగలదను నియమము గలదా ? అట్టిదేమియు లేదే !

మన దేశములో మిగుల ప్రధానమగు అంశము సరుకు పడు పాటుగనున్నది. మన అవసరముల దీర్చుకొని గోరితిమేని మన ఆకలిని జల్లార్చుకొనుటకు, ఈ యంశమును హెచ్చుగ నుపయోగ పఱచుకొనవలసి యున్నాము.

ఉత్పత్తి విధానము సందర్భమున పెద్దపెద్దయుత్పత్తి కేంద్ర క్షేత్రముల నమర్చి, నవీనయంత్రముల నుపయోగించు నెడల మనప్రజలు ఆర్థికస్థితిని పెంపుచేయ గలమనెడు భావము హెచ్చుగ వ్యాపించియున్నది. ఆ భావమునకు తలయొగ్గుటకు ముందు, దానిని జాగ్రత్తగ పరిశోధింపవలసి యున్నది. ఆర్థిక సంపదయొక్క నిర్మాణమునకు పూనుట యనగ అనేక యంశ ములను సక్రమ పద్ధతిని సమకూర్చుటని అర్థము. అట్టి అంశ ములలో ప్రధానము లగునవి నైసర్గికాధారములు, ధనసంచ యము, పాటులేక శ్రమయునై యున్నవి. భిన్నభిన్న పరిస్థితు లందు భిన్నభిన్నరీతిని వీనిని సమీకరణము చేయవలసివచ్చును. బ్రిటను దేశమునందలి పారిశ్రామిక విప్లవ సమయమునందు పెట్టుబడి పుష్కలముగ నుండెను. కావున వారి యుత్పత్తి విధానమునందు ధనసంచయమునకు ప్రాధాన్యత వచ్చినది.

అమెరికాలో నైసర్గికాధారములు అనంతముగ లభ్యమై యుండుటవలన వారు 'శ్రమ'ను తగ్గించు నుపాయముల నవలంబించిరి. అందువలన యంత్ర బాహుళ్యము వచ్చిపడినది. ఆతీరు ఆర్థిక నిర్మాణము సహజముగ 'శ్రమనివారణో' పాయములకు దారిజూపినది; అనగ నిరుద్యోగ సమస్యకు దారితీసిన దన్నమాట. ధనము కఱవుగనుండి పాటు పడువారు హెచ్చుగ నున్న మన దేశమునందు, బ్రిటనులోను అమెరికాలోను అనుసరింపబడు పద్ధతి సహజముగ ప్రతికూలమగును.

నరుడే యొక చక్కని యంత్రముగ నున్నాడు. ఉన్న భేదమేమన యాంత్రికోపకరణమువలెగాక, పనిచేయు సమయమునను పనిచేయని సమయమునను కూడ వానికి తిండి అవసరమగుచున్నది. కాబట్టి యాంత్రిక సాధనల మూలాన ఆహార పదార్థాలను ఉత్పత్తిచేసినను సయితము, ప్రజలకు తిండిపెట్టక తప్పదు. కాబట్టి లభ్యముకాగల యంశముల నన్నింటిని ఉత్పత్తి నిమిత్తము ఉచితరీతిని వినియోగపఱచుకొను టనగ మన దేశములో నరుని సమర్థతను విశేషముగ వినియోగించుకొనుటయే అని తెల్లమగును. ఆ పద్ధతి నవలంబింపకపోతిమా మన దేశములో నున్న గొప్ప శ్రమశక్తిని వ్యర్థముగ విడిచివేసిన దోషమునకు పాల్పడినవార మగుదుము. ఆ మార్గము మనకెన్నడును నైశ్వర్యము నొసగ జాలదు.

కేవలము భౌతికోత్పత్తియొక్క పెరుగుదలయు జాతియొక్క అభ్యుదయము మనజాలము. ప్రజలు తమ యవసరముల దీర్చుకొనుటలో నుపకరించునంతవఱకే ఉత్పత్తికి ప్రాధాన్యత గలదు. కాబట్టి చాలినంత తిండి దొఱకు కొఱకు ఆహారద్రవ్యములు,

శీతోష్ణములనుండి రక్షించుకొను కొఱకు బట్ట, తగినంత నివాస వసతి వీనికి సంబంధించునంతవఱకు మన యవసరములను తీర్పజాలు వస్తువుల నుత్పత్తిచేయు నిమిత్తము ప్రజలయందొక వ్యవస్థను గూర్చుటకై మనము ముమ్మొదుగ ప్రయత్నింపవలసి యుండును. పిమ్మట వారి శారీరక, మానసిక, నైతిక క్షేమము కొఱకగు వైద్య సహాయమును విద్యను తదితర సాంఘిక సహాయములను సమకూర్చుటకై యేర్పాటులు చేయవలెను. ఈ ప్రాథమికావసరములు తీరనంతవఱకు విక్రయమునకై ఎగుమతి చేయవగు వస్తువుల ఉత్పత్తినిగూర్చి శ్రద్ధవహించుట దోషమగును. ఏ లోభిమానవుడో లెక్కించి చూచుకొని సంతోషపడుటకు తప్ప ధనము ప్రత్యేకముగ నెందులకును ప్రయోజనకారి కాదు. ధనార్జనమే కేవలముగ మనలక్ష్యము కాజాలదు. మనము కూర్చు వ్యవస్థ వలన ప్రజల చేతులలోనికి డబ్బు వచ్చి పడుచున్నను వారు తిండిలేక మాడవలసి వచ్చునెడల ఆవ్యవస్థ దూష్యమనక తప్పదు. కాబట్టి ప్రజలకు తృప్తికరముగ తిండి, బట్ట, నివాస సౌకర్యము అమరునటుల చూచుట మన ప్రథమ కర్తవ్యమై యున్నది. ఈ అవసరములు తీరిన పిమ్మటమాత్రమే యితర వస్తువుల నుత్పత్తిజేయు పూనిక అంగీకారము కానగును. ప్రజల ఆర్థికోద్యమము ఈ పంథాలోనికి మరలించుట ప్రభుత్వ మనిపించుకో నర్హతగల ఏ దొరతనముకైనను ప్రప్రథమకర్తవ్యమగును.

ప్రజల శారీరకావసరములతీర్చుటయేకాక స్వావలంబనబుద్ధి, పరస్పరసాహాయచింత, సంఘీభావగరిమ వారియందు నెలకొల్ప జూచుటకై మనము పూనికవహింపవలయును. ఈ లక్ష్యమును

మనము సాధింపగలిగినపుడు స్వయం సంపూర్ణ ద్వారమున స్వరాజ్యము సాధించుటలో చాలదూరము పోయినవార మగుదుము.

మన పథకము ఏకొలదిమందికో సంబంధించినది మాత్రము కాక యీ దేశము నందలి ప్రతి పౌరునకు సంబంధించినదని. యీ సందర్భమున మనము జ్ఞప్తియం దుంచుకొనవలయును. మనము ప్రతిపాదించు పథకము సంతృప్తికరమగు పథకమే యగునేని అది భారతదేశమునందు జీవించు ప్రతి నరునకును ఉపకరించునదిగ నుండవలెను. అటువంటి విశాలాధారసమన్విత మగు పథకము పెట్టుబడికి ధనము లభింపజాలని దారిద్ర్యపీడిత దేశములో పెట్టుబడి చేకూరగలదను ప్రతిపాదన నాధారము చేసికొని వర్ధిల్లజాలదు. పెట్టుబడి ధనము లభించుటపై ఆధార పడియుండు పథక మేదియు భారతదేశములో అంగీకారము కాజాలదు. మఱియు తిండిని సమకూర్చుట యనెడి ప్రాథమి కావసరము నుపేక్షించు పథక మేదియు సమాదరణీయము కాదు. భారతదేశములో శ్రమయనెడు సంపదను ప్రధానాంశ ముగ గైకొనని పథక మేదియు సక్రమమైనదని పేర్కొనజాలము. పాశ్చాత్యుల పథకములు ద్రవ్యమే లక్ష్యముగ గలవై పఱుగు నది. అనగ సమస్తాధారముల నుండియు లాభములను సంగ్ర హింప జూచును. సరే! యిదంతయు నెందులకు? అదేమో వారికి తెలియదు. కుర్చీలు, బల్లలు మన ప్రాథమికావసరముల దీర్పజాలవు గదా!

మన దేశమున కనుకూలించు పథకమేదైనను అది కృషీ వళులని కేంద్రబిందువుగ గొని విస్తరింపవలసియుండును. అందుండి

అది దేశమంతట వ్యాపింపగల్గును. తుదకు మనము ఇంగ్లాండు తోడను అమెరికాతోడను భాగ్యమున తులతూగజాలకనే పోవచ్చును, కాని మనకు పుష్కలముగ ఆహారము లభింప గలదు. ఐదేండ్ల క్రిందట ఇంగ్లాండు తిండి దొరకక మాడవలసి వచ్చినది.

కాబట్టి ఆహారవిషయమునను, గుడ్డ విషయమునను స్వయం సంపూర్ణముగ నుండుట భారతదేశమునకు అనుకూలపడు ఏ ప్రణాళికకైనను ప్రధానలక్షణముగ నుండవలెను. ఇందు ప్రతి గ్రామమును అన్నవస్త్రముల విషయమున స్వయంసమృద్ధము కాదేని స్వరాజ్యముండి మనకు లాభములేదు. ప్రతి వానికిని చాలినంత అన్నము వస్త్రము దొరకగలదని దృఢ విశ్వాసము మనకు కావలయును. అట్టి నిశ్చయము మనకు చేకూరజాలదేని ఆపథకము మన దేశమునకు పనికిరాదు. టాటాబిర్లా పథకముగాని, మఱియు అటువంటి యితరపథకములు గాని ఆచరణలో సాగింపవలెనన్నచో వేలకొలంది కోట్ల రూపాయలు కావలసివచ్చును. మన పథకమునకో విశేషధన మవసరములేదు. ఏమన మనకు లేనిదానిపై ఆధారపడి మనము పనిచేయబోవుటలేదు. మనము ప్రజలకున్న కార్యశక్తినే నూతన పథకములకై మరలింప జూచుచున్నాము. మనము చేయునది వారి కనుకూలమైన మార్గము చూపుట మాత్రమే, మనము ప్రజలలో సహజముగనున్న కార్యశక్తిని క్రమగతిని నడుపజూచుచున్నాము. తద్వారమున కోట్లాది ప్రజలయైకమత్య కార్యకలాపమును హితమగు తెన్నున నడుప నెంచుచున్నాము.

# అధ్యాయము 2

## వ్యవసాయము

ప్రథమముగ మనము జాగ్రత్త పడవలసినది అన్నవస్త్రములను గురించి. అందు కొఱకై వ్యవసాయము మీదను గ్రామ పరిశ్రమల మీదను మన దృష్టిని కేంద్రీకరింప వలసియుండును. వ్యవసాయ మూలక ఉత్పత్తి క్రమగతికి మరలించి అదుపులో బెట్టు నప్పుడు మనము రెండు విషయములను మనస్సులో నుంచుకొన వలయును. 1. తమ ఆహార ద్రవ్యముల నన్నిటిని ఎక్కడివారక్కడ ఉత్పత్తి చేయుటకు ప్రయత్నించ వలయును. 2. ఫ్యాక్టరీల కొఱకుగాక, గ్రామపరిశ్రమలకు అనుకూలములగు ముడి పదార్థములను సమకూర్చుట వారి యుద్దేశ్యముగ నుండవలయును. ఉదాహరణకు ఫ్యాక్టరీలకు కావలసియుండు గట్టి బెరడుగల చెఱకును, పొడవు పేసుగల ప్రత్తిని పండించుటకు మారుగ, బెల్లము చేయుటకు గ్రామములోని గానుగలలో వేసి త్రిప్పుట కనువగు మెత్తని బెరడుగల చెఱకును, చేతితో రాటముమీద వడుకుట కనువగు పొట్టిపోసుగల ప్రత్తిని పండించవలెను. అదనముగ నున్న భూములను చుట్టుపట్ల జిల్లాల కవసరమగు పంటలకై వినియోగించవలెను. ఫ్యాక్టరీల యుపయోగార్థము చెఱకును, పుగాకును, గోగునారను ఇంక నిట్టి ధనార్జనకగు పంటలను పండించుట కుపయోగించు భూమిని కనిష్ఠ పరిమాణమునకు తగ్గించ వలయును; లేదా, అవసరమగు నేని పూర్తిగ తొలగించివేయవలయును. వ్యవసాయదారు లీ విధానము ననుసరించునటుల చేయుటకు, దొరతనమువారు రాష్ట్రము కొఱకై వేసిన ప్రణాళికల ననుసరించి కొన్ని కొన్ని పంటలనే పండించునట్లు వ్యవసాయకులకు లైసెన్సులనిచ్చి అదుపు చేయవలెను; లేదా ధనార్జనకొఱకగు పంటల పండించుట కుప

యోగపడుచు భూములమీద హెచ్చు సిస్తునుగాని, అధికపు పన్నులనుగాని విధించవలయును. ఆహారపు పంటలను మాని ధనార్జనపు పంటలను పండించుటకగు వ్యవసాయదారుల యుత్సాహము నిది అణచిపట్టగలదు. మొత్తముమీద పారి శ్రామిక వస్తువుల ధరలతో వ్యవసాయకపు పంటలధరలు సరిపోలనగు తీరున యేర్పాటులు జరుగవలయును.

పొగాకు, గోగునార, చెఱకు మొదలగు వాణిజ్యపు పంటలు పండించుట రెండువిధముల నష్టదాయకము. మనుష్యులకును పశువులకును కూడ వినియోగపడు ఆహార పదార్థములు కొఱ వడిపోవును. ఎట్లన ఆహారపు పంటలవలన పశువులకు వలయు మేతకూడ లభించగలదు గదా!

ప్రాథమికోత్పత్తులగు ధాన్యములను పాలను వ్యాపార లాభము నిమిత్తము పిండిని మీగడను తయారుచేయుటలో వినియోగింప నీయరాదు. ఫ్యాక్టరీ రకపు చెఱకుపంటను తగ్గించుటవలన, బెల్లపు సరాఫరాలో నేర్పడు తగ్గుదలను, ఇప్పుడు కల్లుకొఱకై గీతగీయబడుచున్న తాటిచెట్లవలన లభించు బెల్లముతో పూర్తిచేయవచ్చును; లేదా గయాళు భూములమీద నున్నట్టిగాని, వానిమీద అత్యధికముగ పెంచ వీలగునట్టిగాని తాటిచెట్ల సాయమున మనకు కావలసినంత బెల్లమును తయారు చేయించి ఆ లోటును దీర్చుకొనగును. ఆ విధముగ నీనాడు చెఱకు పంటకై వినియోగపడుచున్న శ్రేష్ఠమగు భూములను, దేశములో కొఱవడి పోవుచున్న ధాన్యములను, పండ్లను, కూరగాయలను పండించుటకు వినియోగింపగల్గుదుము.

సమతుల్యాహారమును సమకూర్చుకొనుటతో ప్రారంభము చేయుట ముఖ్యముందుగ జరుగవలసినపని. భారత దేశములో

ధాన్యము మాత్రము తిని బ్రతుకు ప్రజ అధికము. శరీర మున కవసరములగు ద్రవ్యము లన్నియు ధాన్యములం దొక్కచో కూర్చబడి యుండలేదు. సమతుల్యాహారమున కవసరమగునవెల్ల ప్రతి గ్రామముననుపండునటుల మన వ్యవసాయకృషిని సంస్కరించునెడల, తేలికగ మనకు సమతుల్యాహారము దొరకగలదు. ఆ తీరుగ నొక్కొక్కవిధమగు నాహారమునకు వలయు ద్రవ్యములు లభించునటుల సన్నిన్ని యకరములమీద సాగుచేయవలయు ననెడి నియమము నేర్పాటు చేసికోవలయును.

ఏ యితరాహారముకన్నను ధాన్యపు పంటవలన హెచ్చు కాలరీలు ప్రతి యకరము మీదను లభించునను తలంపుగలదు. కాని కాలరీల విషయ మటులుండ, ధాన్యములందు పోషకాహార ద్రవ్యములు తకుగుగ నుండును. ఈ పోషక ద్రవ్యములను ధాన్యముల ద్వారముననే పొందవలయు ననిటేని, అత్యధికమగు ధాన్యరాసు లవసరమగును. ఇటులగాక ధాన్యములకు మారుగను, తోడుగను పండ్లు, కూరగాయలు, పాలు, పాలతో చేసిన వస్తువులు, బెల్లము, పప్పులు చముకుగింజలు మొదలగు వానిని వినియోగించు కొందుమేని, సమతుల్యాహారమును సమకూర్చుట కవసరములగు పోషకాహార ద్రవ్యములను కేవలము ధాన్యాహారముల దినుచప్పటికంటె, తక్కువ పరిమాణముగల ఆహారము ద్వారముననే పొందగల్గుదుము. ప్రతి యకరముమీద లభింపగల కాలరీల విషయముగ సయితము, ధాన్యముల ద్వారమున కన్న బెల్లము, బంగాళా దుంపలవంటి దుంపకూరల ద్వారమున హెచ్చుగ కాలరీలు లభించును. కావున సమతుల్యాహారము రెండురీతుల శ్రేయో

దాయకమై మన సమస్యను సులభముగ పరిష్కరింప గల్గును. ప్రతివాని జీవనమునకు భూమి విస్తీర్ణము తగ్గగలదు; మఱియు శరీరమును సమర్థముగను ఆరోగ్యవంతముగను నుంచుట కను వగు నివృత్తిలో అన్ని అంశములును సమకూరును. ప్రస్తుతము భారతదేశమున ఆహారోత్పత్తికిగాను ప్రతివానికి వినియోగ పడుచున్న భూవిస్తీర్ణము ఏడుసెంట్లగుచున్నదని లెక్కలవలన తెలుచున్నది. ప్రస్తుతమున్న వ్యవసాయపు పంపిణీ ననుసరించి ఆహారావసరములలో కొఱత యేర్పడునట్లున్న యీ వ్యవసా యభూమియే, చక్కని యేర్పాటులతో వ్యవసాయము చేయు నెడల సరిపోగలదు. ఈవిధముగ ఎక్కడెక్కడనున్న భూమిని అందునసించు ప్రజలకు సమతుల్యాహారమును, వస్త్రసమృద్ధిని, మఱియు నితరావసరములను ప్రసాదింప గల్గునట్లు పంపుళ్లు చేయవలసియుండును. పూర్ణ పరిశోధనచేసి యీ సమస్యాపరి ష్కారము గావించి, యొక నిర్ణీత పథకమును రచించి, వ్యవ సాయదారులు తమతమ భూములమీద పండింపదగు ప్రత్యే కపు పంటలగూర్చి లైసెన్సుల నొసగుచు అదుపులో నుంచవల యును. ఈ తరువాతి పుటమీద ఒకలక్ష జనాభాకు తగునట్లు సమతుల్యవ్యవసాయమునకు భూమి నెట్లు విభాగింపవచ్చునో సూచింప బడినది. ఈ విభాగము సామాన్య పురుషునకు, దిన మునకు, 2860 కాలరీ లొసగు సమతుల్యశాకాహారమును చేకూర్చుచు, సంవత్సరమునకు తలకు 25 గజముల వస్త్ర మునకు సరిపోవు ప్రత్తిని పండించగల యేర్పాటును సూచించు చున్నది. శాకాహార మక్కరలేనిచో 6 ఔన్సుల పాలకు మారుగ 4 ఔన్సుల మాంసమునుగాని చేపలనుగాని ఒక కోడి గ్రుడ్డుతోసహా యీయవచ్చును.

## ఒక లక్ష జనాభాకు తగినట్టి వ్యవసాయపు పంపకము.

| I ఆహారము | దినమునకొక్కనికి ఔన్సులు | కాలరీలు | సంవత్సరము నకు టన్నులు | లక్షమందికి కావలసిన యకరముల భూమి | లక్షమందికి ఉత్పత్తియందు నూటికి 15 పాళ్లు అధికముగ | లక్షమందికి మొత్తం | నూరు ౧ ॥ లెక్కకు పంపకము |
|---|---|---|---|---|---|---|---|
| ధాన్యము | 16 | 1600 | 265.00 | 42,400 | 6,510 | 49,910 | 65.2 |
| పప్పులు | 2 | 200 | 45.60 | 5,400 | 810 | 6,210 | 8.0 |
| బెల్లము | 2 | 200 | 45.60 | 1,200 | 180 | 1,380 | 1.8 |
| గింజలు (సేరుశెనగ వంటివి) | 1 | 145 | 22.80 | 2,600 | 290 | 2,990 | 8.4 |
| చమురు | ½ | 255 | 11.40 | 2,000 | 450 | 2,450 | |
| నెయ్యి | ½ | — | 11.40 | ... | ... | ... | ... |
| పాలు | 12 | 240 | 273.75 | ... | ... | ... | ... |
| కూరగాయలు | 8 | 48 | 182.50 | 1,600 | 240 | 1,840 | 2.4 |
| బంగాళాదుంపలు / ఇతరములగుదుంపలు | 4 | 100 | 91.25 | 1,000 | 150 | 1,150 | 1.5 |
| పండ్లు | 4 | 52 | 91.25 | 900 | 125 | 1,025 | 1.4 |
| II వస్త్రములు | | | | | | | |
| ప్రత్తి | | | 12.50 | 7,500 | 1,125 | 8,625 | 11.2 |
| వెరశి | | 2860 | | 66,600 | 9,990 | 76,590 | 100.0 |

ఈ పై అంకెలు అఖిలభారతదేశపు లెక్కలాధారముగ తెల్పబడినవి. ఆయా స్థలవిశేషములను బట్టి మారగలవు. ప్రతివ్యక్తికిని 16 ఔన్సుల ధాన్యము నంగీకరింతుమేని, మన భూమి స్థీర్ణములో నూటికి 65.2 వంతులు ధాన్యము పండించుటకే వినియోగింపవలసివచ్చును. అటులనే తలకు 2 ఔన్సుల పప్పుల నిచ్చునెడల, ఆ పంటకై మనభూమిలో నూటికి 8 వంతులు వినియోగింపవలసియుండును.

ఈ అంచనాలు లక్ష జనాభా ఆధారముగ గణింపబడినవి. ఒక గ్రామమునగాని, తత్సమీపప్రదేశమునగాని, యీ నిష్పత్తితో ఆవస్తువుల పండించునెడల ప్రజల ప్రాథమికావసరములు తీరగలవన్నమాట. కావున యీ పంటలను పండించుటకై మనము ప్రయత్నము చేయవలయును. భూమి సాంఘికసంపదయై యున్నది. దానిని సంఘమున కవసరమగు విధాననే వినియోగము చేయవలయును. 'నాకిన్ని యకరముల భూమి యున్నది; దానిపైన నేను పుగాకుపైరు వేయబోవుచున్నాను' అని యెవరేని పలుకవచ్చును. అది వానికి హెచ్చు ధనము నొసగునను కారణముచేత అతడు పుగాకును పండించు హక్కుగలవాడుకాడు. సమాజములో వ్యక్తిత్వేనా నాయిష్టము చొప్పున నేను చేయజాలని విషయము లనేకముగలవు. ఉదాహరణకు, రోడ్డుమీద నేను కుడివైపుగ బండితోలుకు పోజాలను. 'భూమిపైగల స్వామ్యమునీదియే, సందియములేదు. కాని దానిని ప్రతివానికిని ఉపయోగకరమగు తీరుననే నీవు వినియోగము చేయవలసియుండును. కావున కొన్నివస్తువులను పండించు సందర్భమున లైసెన్సులను దీసికోవలయునని సూచింప

బడినది. అవిశేషిత్తులు పండించుటకై తైసెన్సును పొందిన మనుజుడు, తనకు పదిరెట్లు లాభము రానున్నను అందు పుగాకు పండింప సేలులేదు.

అవసరమగునంతవఱకు, ఏగ్రామములోని యుత్పత్తిని ఆ గ్రామములోనే నిలిపి యుంచుటే మన ఆశయము. అంతకు మిగిలిన దానిని మాత్రమే మనకు కావలసిన యితరవస్తువులకై మార్పిడి చేసికొనవచ్చును. ఉదాహరణకు ఒకానొకగ్రామములో ప్రత్తిపండు ననుకొనుడు. దానిని బట్టల మిల్లునకు బంపి దానిని వస్త్రరూపమున తిరిగి పుచ్చుకొనదగదు; ఏమనగ దానినిబట్టగ మార్చుటందుకై మనము ఎగుమతిచేయు నేదేని వస్తురూపమున కొంత ప్రతిఫలమీయవలసి వచ్చునుగదా! మనము మన ఆహార ద్రవ్యములను పోగొట్టుకొనగోరని పక్షమున, మనప్రత్తిని మనమే విశ్రాంతి సమయమునందు, వస్త్రముగ తయారుచేసికొనవలసియుండును. అటులచేసితిమా, మన ఆహారద్రవ్యమంతయు మనకేయుండును; మఱియు వస్త్రముకూడ లభించును. అందు మూలమున మనకు రెండువిధముల లాభము చేకురుచున్నది. తత్కారణమున మిల్లు యజమాని నష్టపడవచ్చును. వానియెడ జాలిజూపుదుముగాక. కాని మన గ్రామపు బీదవానిక్షేమమును సంరక్షింప వలసియున్నాముగదా! మనపథకము గ్రామవాసి స్థితిని బాగుపఱచుటకై యుద్యమింప బడియున్నది. అందు కొఱకై మనము పనిపూని, ఆ తీరున పాటుపడితిమా, తిండి బట్ట విషయమున గ్రామవాసులను స్వయసంపూర్ణుల చేయ జాలుదుము.

ఇట్టుల సమతుల్యాహారమున నిమిడియున్న యంశముల దెలిసికొని ఆ జనాభాకు కావలయు ఆహార పదార్థము నుత్పత్తి చేయుటకొఱకు సాగుబడి భూమిని సముచిత రీతిని విభాగము చేయుటకు పూనుకొందుముగాక. అప్పుడు స్థానికముగ నున్న జనాభాయొక్క యవసరములను పూర్తిగ తీర్చిన యనంతరము, అదనముగ నుంట తటస్థించెనేని అట్టి ఉత్పత్తులను మాత్రమే యితరస్థలముల కెగుమతిచేయ ప్రారంభింతుము. స్థానిక ప్రజల యొక్క అవసరముల గడపుటలోనే లోటుగనుండగ, ఆపదార్థములనే యెగుమతి చేయుటలో సాయపడు నట్టిగాని ప్రోత్సహించు నట్టిగాని ప్రభుత్వ విక్రయశాఖ దేశద్రోహకరమైన దగును. మఱియు ప్రజలనందఱను ప్రయోజన కరమగు పనులలో నియోగించు నిమిత్తము సర్వవిషయమ్ములను సమకూర్ప దగు నేర్పాటుల గావించవలయును.

# అధ్యాయము 3

## విషయము

పలుప్రయోజక సహకార సంఘములు:—

సహకారసంఘములు గ్రామ పరిశ్రమలను వృద్ధిచేయుట కొఱకేగాక గ్రామీణుల సమష్టికృషికి ప్రోన్నతి గల్పించుట కును ఆదర్శప్రాయముగ పనిచేయగలవు. ఒక పలుప్రయోజక గ్రామసంఘమున్నచో, అది వివిధ రీతుల పనిచేయ సమర్థమై పఱగ గలదు. 1. ఆగ్రామప్రజ కవసరమగు ఆహారపదార్థము లను, వారి పరిశ్రమలకు వలయు ముడివస్తువులను సమకూర్చి నిలువ చేసిపెట్టగలదు. 2. అదనముగ గ్రామమున నుత్పత్తి యగు వస్తుజాలమును విక్రయించుటకును, అవసర పదార్థము లను ప్రజకు పంచియిచ్చుటకును ఉపకరించగలదు. 3. విత్తనా లను సుపరిణతములైన పసముట్లను, పరికరములను, ఎముకపొడి మాంసము, చేపలుమున్నగువానితోడను తయారైన ఎఱువు లను సమకూర్చి పంచి పెట్టగలదు. 4. స్థానికముగ నుపయో గించు ఆబోతును సాకగలదు. 5. దొరతనమునకును ప్రజకును మధ్యవర్తిగనుండి సిస్తులను వసూలుచేయుచు పన్నులను చెల్లిం చగలదు. ఇంకనిట్టి పనులెన్నియో చేయగలదు.

ఆహార ధాన్యములను ప్రోవుచేయుటలోను వేర్వేఱుస్థలము లకు బంపుటలోను వానికిగలుగు తఱుగును, ఆహారధాన్యము లను వేర్వేఱు స్థలములనుండి యొక కేంద్రస్థానమునకు చేర్చుట లోను, వానిని గ్రామస్థులకు పంచియిచ్చుటలోను సంభవించు ఖర్చులను సహకారసంఘ సాహాయ్యమున తప్పించుకొనగును.

ప్రభుత్వదృష్టిలోను ప్రజాదృష్టిలోనుగూడ విశ్వాసపాత్రమగు మధ్యవర్తిగ ఆ సంఘము వ్యవహరించగలదు.

వ్యవసాయదారుడు తనకుటుంబమునకు కావలసిన ధాన్యమును నిలుపుకొని మిగులు ధాన్యమును సహకారసంఘమున దాచిపెట్టుకొనగలడు. అటుల నతడా సంఘములో తనకుగల పరపతి నాధారముచేసికొని తన కవసరములగు వస్తువులను సంపాదించుకొనగలడు. ప్రభుత్వమునకు చెల్లింపవలసిన సిస్తు వగైరాలను విధిగ డబ్బురూపమున చెల్లించుటకు మారుగ ధాన్యరూపమున చెల్లింప వీలగును. ఈనాడు రివిన్యూ వసూళ్లను గ్రామస్థులనుండి డబ్బురూపమున ప్రోగుచేయుట చాల కష్టమగుచున్నది. గ్రామ సహకారసంఘములలో ధాన్యపు నిలువలు కూర్చిపెట్టు నెడల స్థానికోద్యోగులకు గూడ వస్తురూపమున జీతము లిచ్చుటయు వీలగును.

డబ్బురూపమగు ఆర్థికదశ సత్యమగు ప్రయోజనమును తెలుపునదికాదు. డబ్బు ఒకనిచేతిలోనుండి యింకొకని చేతిలోనికి మారునప్పుడు దాని ప్రయోజనము తారుమారగుచుండును. ఒక ధనికునిచేతిలోని రూపాయియొక్క ప్రయోజనమునకును ఒక దరిద్రునిచేతిలోని రూపాయియొక్క ప్రయోజనమునకును చాల భేదము కలదు. అటువంటి మార్పులు జాతీయసంపదయొక్క ప్రయోజనమును పెంచగలవు, లేదా జాతిని దారిద్ర్యమున ముంచను గలదు. పైచూపులకు రూపాయి రూపాయిగనే చూపట్టును. కాని వ్యవహారములో నది మార్పు చెందుచున్నది. పేదవానిచేతిలో నొకరూపాయి యున్నదనిన వానికి నాలుగైదు పూటల ఆహార మున్నదర్థము. మఱియు

నదియే యొక శ్రీమంతునిచేతిలో నున్నయెడల దానికొక సిగరెట్టు విలువమాత్ర ముండగలదు. ఈరీతిగ ఒకరూపాయి పేదవానిచేతినుండి యొక కోటీశ్వరుని చేతిలోనికి పోగానే దాని ప్రయోజనము యెంతగనో తగ్గిపోవుచున్నది; ఇందుకు భిన్నముగ డబ్బు ధనికునిచేతినుండి దరిద్రునిచేతిలోనికి పోవునపుడు దాని ప్రయోజన మెంతగనో పెరుగగలదు. కాబట్టి మన ఆర్థిక వ్యవహారమునందు మన డబ్బును, దాని ప్రయోజనమును తగ్గించువారి చేతులలోనికి పోకుండ జాగ్రత్త తీసుకొనవలసి యుండును. సరిగ యీపనినే మన పలుప్రయోజన సహకార సంఘములు చేయవలసియున్నవి. అట్టి సంఘము గ్రామస్థుల నుండి పండిన ధాన్యములను ప్రోగుచేసియుంచి ప్రభుత్వపు సిస్తును, ఇతర వస్తువుల కొను క్రయధనమును వస్తురూపమున చెల్లింపవచ్చును. ప్రభుత్వముతరఫున ప్రభుత్వోద్యోగులకు సమ కల్యాహార పదార్థాలరూపమున జీతముల చెల్లింపవచ్చును. ఈ అవసరములన్నియు తీరిన యనంతరము ప్రభుత్వమునకును పలుప్రయోజన సంఘములకును మధ్య సరిచేసుకొనతగిన మొత్తములు స్వల్పముగ నుండును. ఆపనిని అదనముగ సహకారసంఘములలో మిగిలియుండు పదార్థములను ప్రభుత్వముకోరు తీసున వేర్వేఱు స్థలములకు రవానాచేసి సరిపెట్టుకొనవచ్చును. ఈ విధముగ వ్యవహరించునెడల, డబ్బుపై నాధారపడు ఆర్థిక వ్యవస్థయొక్క అనర్థములను పూర్తిగ నాశనముచేయుట కాసగ కున్నను, చాలవఱకు తొలగించినవార మగుదుము. ఆతీరున డబ్బురూపమునకు గల బూటకపు విలువకు భిన్నముగ వస్తురూపమునగల సత్యమగువిలువను నిలువబెట్టిన వారమగుదుము.

# అధ్యాయము 4

## సహకార ధర్మము

బ్యాంకుల ధర్మము:—

వాణిజ్య పారిశ్రామిక రథముల చక్రములకు చమురువేసి అవి సులభముగ జరుగునటుల అవరోధముల తొలంగించుటయే బ్యాంకుల ధర్మము. వీనికి తోడుగనుండి, ఆర్థిక వ్యవస్థయొక్క వివిధశాఖల మధ్యను క్రియాపూర్వకమగు సహకారమును సమకూర్చు పనిని సహకారసంఘములు నిర్వర్తించుచుండవలయును.

డబ్బురూపమున ఆర్థికనిర్ణయములుచేయు పాశ్చాత్యదేశములందలి బ్యాంకులసందర్భమున వానిలో ప్రజలువేసికొనిన డబ్బు మొత్తములను, అందుజరుగు వ్యాపారము వలన సంపాదించిన లాభములను ఆధారముగ జూపి వాని అభివృద్ధిని నిరూపింతురు. మనకది పనికిరాదు. ప్రజల క్షేమాభివృద్ధికి సంబంధించి బ్యాంకయొక్క ప్రయోజనమును మనము నిర్ణయింతుము. డబ్బురూపమున నష్టము కాన్పించుచున్నను కూడ, ప్రజల యవసరముల దీర్చుచు, వారి ఆర్థిక వ్యవహారములందు అనేక ధర్మములను మన బ్యాంకులు నిర్వహించవలసి యున్నవి. ఇన్ని రూపాయిలు అణాలు పైసలు అని లెక్కకట్టి ఒక బ్యాంకు ఇంతపని చేసెనని నిరూపించ జాలము.

ఉత్పత్తిచేయు వారల జీవరక్తమును పీల్చివేయు కొరుక్కై పెట్టుబడి సాహుకారుల చమత్కృతివలన, చర్మమునుండి నెత్తురులాగు సిరింజియొక్క సన్నని గొట్టపు సూదివలె. పాశ్చా

త్యేల బ్యాంకు పద్ధతి వ్యవహరించుచున్నది. ఇంపీరియలు బ్యాంకుతో జతగూడి ప్రభుత్వపు సొమ్మునకు సంరక్షకులుగ వ్యవహరించు గౌరవమును పొందియున్నట్టి రిజర్వు బ్యాంకు నందు నెలకొల్పిన వ్యవహారాధికారమును దుర్వినియోగము చేయుట మూలముననే, 1943 సంవత్సరమున వంగదేశము నందు ముప్పది లక్షల ప్రజల ప్రాణముల బలిగొనిన క్షామము సంభవించెనని తెలియుచున్నది. ఆ బ్యాంకుల వ్యవహారము ఈదేశ ప్రజలకొక మహాఘోరానర్థమై పరిగినది. డబ్బు యొక్క దుర్వినియోగము వలననే యిదంతయు మూడినది.

డబ్బును వస్తుమార్పిడి కొక సాధనముగ గాని లేక కొను గోలు శక్తిని నిలువజేసి పెట్టుకొను నుపాయముగ గాని విని యోగించుకొనునెడల అది తృప్తికరముగ నుపయోగపడ గలదు. సంచారములతో పోల్చిచూచు నప్పుడు ధనమునకు చిహ్నములుగ నుపయోగించుకొను డబ్బులు సామాన్యముగ అక్షీణము లనవచ్చును. కావున చేతడబ్బును బెట్టుకొనినవాడు, దీర్ఘకాలము బేరాలాడు శక్తిగలవాడగుచున్నాడు. అరటి పండ్లమ్ముకొను వనిత, అవి చెడిపోక మునుపు విక్రయించు కొనక తప్పదు. కాని డబ్బుచేతగల వాని కటువంటి యిబ్బంది లేదు. అతడెంత కాలమైనను తన డబ్బును చేతబట్టుకొని కూర్చుండ గలడు. కావున యీయుపయోగమునగల తారతమ్య మును బట్టి డబ్బుగలవాడు సరకుగలవానిని వంచగల్గుచున్నాడు. బ్యాంకులు సాధారణముగ డబ్బుచేత బట్టుకొనిన వానివలె వ్యవహరించుచున్నవి. వాని స్థితియందు గల సదుపాయములు, పారిశ్రామిక వాణిజ్యక్షేత్రము లందెట్లుని వ్యవహరింపగలవో

నిరూపించును. ఒక వ్యవస్థగ తన పరపతిని బలపఱచుకొను కొఱకు బ్యాంకు తన అధికారమును వినియోగము చేయుపట్ల తద్వారా దాని ఖాతాదారుల పరపతి క్షీణించు నెడల, ఆర్థిక వ్యవస్థయందు ఆబ్యాంకు యొక్క ధర్మము నెరవేరినదన వీలు లేదు. వస్తుమార్పిడి సాధనముగ డబ్బుయొక్క ప్రయోజనము ఇటులుండును.

కొనుగోలుశక్తిగ డబ్బు ప్రయోజనము:—

డబ్బు ఆక్షేపణమనుపట్ల, దానియొక్క సక్రమమైన వినియోగము, ప్రజలయొక్క కొనుగోలుశక్తిని నిలువచేసికొనుటలో నది సాయపడుతీరు ననుసరించి నిర్ణయము కాగలదు. వ్యవసాయకుడు తనభూమిని సాగుచేసి, కోతకోసిన యనంతరము తనపంట నమ్ముకొనును. దానిమూలాన వానికికొంత డబ్బువచ్చును. ఈ డబ్బువానికి మరుసటి పంట వచ్చు నెలకును ఉపయోగపడ వలసియున్నది; అనగ పండ్రెండు నెలలకాలము ఆడబ్బు నిలువకు సరిపోవు నితరవస్తువులకొఱకై దానిని మార్పిడిచేసికొ వలయును. ఈ మధ్య కాలములో, దాని కొనుగోలు సత్తా మారెనేని, ఆవ్యవసాయకుని స్థితియు నదేతీరున తాఱుమారగును. కాబట్టి మన దేశమువంటి వ్యవసాయక దేశములో కొనుగోలు సత్తామారకుండ నిలువజేసికొను విధానము ముఖ్యావసరము. ఈ సందర్భమున పలుప్రయోజక సహకార సంఘములు, డబ్బువ్యాపకమును అదుపులోపెట్టి సాయపడగలవు. అప్పుడు ధరలు తాఱు మారగుటకును, లాభాపేక్షాపరులు పెట్టు చిక్కులకును హద్దు ఏర్పఱచి పంటదారుడు తన సరకు నంతను ఒకే సారిగ అమ్మివేయకుండ నాపి, వాని సరకుల పరపతిమీద ఉచితరీతిని బ్యాంకువ్యవహారము నడిపి ఆదుకొనగలవు.

# సహకార నీతి

ఇక సహకారము యొక్క యింకొక ధర్మమును విచారింతము. సహకారమనగ పోటీభావమును తుదముట్టించి, అందఱికిని లాభము నొనర్ప జూచు భాగస్వామ్యపద్ధతి యని భావము. వ్యాపారమున ప్రమేయముగల అన్ని పక్షములవారి క్షేమమును సమానముగ జూచుటే దాని మూలసూత్రము. సహకారమున నొకరి నణచి మఱొకరు బాగుపడ జూచుట యుండదు. కాబట్టి యొకవైపున లాభాలగుంజుకొనువాడును, రెండవ వైపున వానికి బలియగువాడును పరస్పరము సహకారము జూపుకొనుట యనునది ఘటిల్లదు. విదేశీయులు తమ సరకును మన కమ్ముటకే వత్తురు. వారికి మనతో గల ప్రమేయము అంతవఱకే. అందు నిమిత్తమే వారు ఇతరులను రాజకీయముగ దాస్యమున బడవేసి అదిమిపట్టి యుంచజూతురు. సహకార సంఘములు అమెరికా నూలును చేనేత పనివాండ్రచే కొనిపించుకొనుటలో తోడ్పడునేని, అవి రెండు విరుద్ధపక్షములను లంకె వేయుచున్నారన్నమాట. అది వాస్తవమగు సహకారభావముతో వ్యవహరించుట లేదని అర్థము. గ్రామములో స్థానీయులగు వడుకువారికిని నేతవారికిని పరిచయము సమ్మేళనము గూర్చుట సహకారసంఘములకు అర్హమగు ధర్మము. అవి సర్వత్రా సహకారమును కూర్చవలయును. ముడిపదార్థముల నుత్పత్తిచేయువారికి, వస్తు నిర్మాణము చేయువారికి, వినియోగదారులకు మధ్య సహకారము కూర్చవలయును. ముత్యములను హారముగ చేర్చికూర్చు పట్టుదారమువలె, అన్ని తెగలవారికిని బంధుత్వమును కూర్చుట సహకారసంఘముల ధర్మమై యున్నది.

ప్రభుత్వపు అధికార ధూర్వహులు, మాయమర్మము లెఱుగని గ్రామీణులను మోసగించకుండ సహకారబ్యాంకు కాపాడగలదు. అటువంటి సంస్థలు పండిన సరకును ప్రోవుచేసి, నిలువ పోసి, తమకాతాదారుల తరఫున బాకీలు తీర్పవచ్చును. సిస్తులు చెల్లింపవచ్చును, పన్నులీయవచ్చును; మఱియు సంవత్సరము పొడవునను బజారు ధరలచొప్పున సరకులను అమ్మకము చేసి, ఒకేసారి బజారులోనికి హెచ్చుగ సరకు వచ్చిపడకుండను, ధరలలో మితిలేని యెగుడు దిగుడులు సంభవించకుండను అడ్డుపడగల్గును. ఆర్థికసంస్థయందీ బ్యాంకులు మహాసముద్రములపై పయనించు పెద్ద ఓడలలో నుండు నీరు చొఱరాని గదులతీరునను, దేనికైన తగులు నష్టము కుదింపురాకుండ నావు దిండుల వలెను నుపకరించును.

సహకారసంఘముల ప్రయోజనము యొక్క నిదర్శనములు ధనసంబంధములగు నివేదికలందుగాక, చుట్టుపట్టులందలి బజారులందు కాన్పింపవలయును. అక్కడి విక్రయశాలలు మిల్లులలో తయారైన వస్తువుల తోడను, విదేశములనుండి దిగుమతియైన సరకులతోడను నిండియుండినయెడల మన యువకరముల నష్టము దీర్చుటకు మన యుత్పత్తి సరకులను సమకూర్చు ప్రయత్నములో మనసహకార విధానము ఫలించలేదన వలయును. ఆసహకారసంఘములే సక్రమముగ పనిచేసినయెడల, తిండి, బట్ట, యిల్లు మొదలగు ప్రాథమికావసరముల సమకూర్చుకొనుట యందవి సాయపడియుండును. ఇట్టుల జరుగునెడల విదేశపరిశ్రమాధిపతుల ధనతృష్ణకు ప్రోత్సాహము పూజ్యమే. అప్పుడు ప్రపంచయుద్ధములకు కారణములగుచు వివిధజాతుల మధ్య

మత్సరములు తలనెత్తజాలవు. అప్పుడు సక్రమవిధానమున నడుపబడు సహకారసంస్థల యభివృద్ధి జాతీయ స్వాతంత్ర్యము నొడగూర్చి, తద్వారమున అంతర్జాతీయ శాంతికి పునాది యేర్పడును.

ఎరువులు :—

గ్రామములలో ప్రస్తుతము ఆరోగ్యభంగకరములుగ నున్న చెత్తచెదారములు, పేడలలోని కసవు కుప్పలు, ఎముకలు, మరుగుదొడ్ల పెంటలు మున్నగువానిలో ఆకుచెత్త యెరువును తయారుచేయుటకు వినియోగపడును. దీనిని తయారుచేయుట చాలసులభము. ఇది ఆవుపేడతో సమానమగు మంచి యెరువగును. దేశమునుండి వెలుపలికి ఎగుమతిచేయబడుచున్న యెముకలు తెలగపిండి గ్రామములనుండి వెలుపలికి పోనీయ కూడదు. సున్నపు బట్టీలలో కొంచెము కాల్చిన యెముకలను ఎక్కడివాని నక్కడనే, సున్నపు గానుగలలోవేసి త్రిప్పి పొడి చేయవచ్చును. దానిని వ్యవసాయదారులకు పంచి యీనగును. గ్రామములలో ఎరువుల యుత్పత్తిని సాహాయక ధనము నొసగి కాంట్రాక్టు పద్ధతిని ప్రోత్సహించనగును. ఈ విధముగ గ్రామ పారిశుద్ధ్యమును కాపాడవచ్చును. పాకీవాండ్ర స్థితిని గూడ వృద్ధిపఱచి వారిచేత ఆకుచెత్త యెరువులుచేయించి వారిని వర్తకుల స్థితికి తేనగును.

గ్రామములనుండి చమురు విత్తులను దీసికొనిపోవు నూనె మిల్లులు నూనెను మాత్రము తిరిగి వారికొసగుచు, పిండిని పర స్థలముల కెగుమతి చేయుట మూలమున విలువగల యెరువును మన భూములకు దక్కకుండ జేయుచున్నవి. దీనిని సంపూర్తిగ

ఆపివేయవలసియున్నది. గ్రామములదాటి చమురు గింజలను పోనీదగదనుటకు ఇదొక ముఖ్యకారణము. వాని నెక్కడివక్కడనే నాటు గానుగలలో ఆడించవలయును. అప్పుడు నూనెయు పిండియుగూడ గ్రామములలోనె నిలువయుండి మనుష్యులను ధనవంతులుగను పశువులను పుష్టివంతములుగను భూమిని సారవంతముగను చేయును.

భూమిని సారవంతముచేయు నెపముతో రసాయనికపు ఎరువులను ప్రవేశపెట్టు ప్రయత్నములు సాగుచున్నవి. ప్రపంచమంతటను రసాయనికపు ఎరువుల ప్రయోగము వలన గలిగిన అనుభవము, వాని వలన నష్టమును స్పష్టము చేయుచున్నది. వాని వలన భూసారము పెరుగదు. కొన్నికొన్ని ఓషధులవలనను ఉద్రిక్తపదార్థములవలనను జరుగునటుల నేల తన సారమునంతను వెల్రగక్కును. అందువలన సద్యస్కాలము అమితపు పంట లభించును. కాని తుదిని భూమి నిస్సారమైపోవును. మఱియు, ఈ రసాయనికపు ఎరువులు భూమిలోని క్రిమిజాలమును జంపివేయుటవలన, భూసారమున కాధారములగు వీనిలోటు తటస్థించుచున్నది. చివఱకు ఆ యెరువులు భూమికెంతయు అపకారములని తెల్లము కాగలదు. ఈ ఎరువులను తయారుచేయు ఫ్యాక్టరీలయొక్క యజమానుల బూటకపు ప్రకటనలు వాని విక్రయమునకు హెచ్చుగ తోడ్పడుచున్నవి. కాని వానివలన వ్యవసాయమునకు హానియు ద్రోహమును ఈ యజమానులకు పట్టదు.

**ఖనిజ్జనములు :—**

వ్యవసాయ మభివృద్ధి జెందవలయు నన్నచో, మేలిరకపు

విత్తనముల నేర్చి వృద్ధిచేయుట ప్రధానము. సహకారసంఘముల ద్వారమున విత్తనముల నుత్తమ మార్గమున సేకరించి పంచియిచ్చుట అత్యవసరము. ఈ సంఘములు పరిశోధనా సమర్థులగువారి ఆధిపత్యము క్రింద విత్తనపుచేలను నిర్వహింపవలసియుండును.

ధాన్యపునిలువలు :—

నిలువచేయుట యందగు లోపములవలన ధాన్యములకు చాల నష్టము వాటిలుచున్నది. తక్కువగవేయబడిన మదింపుచొప్పుననే, ఈ నష్టము సుమారు ముప్పదియైదులక్షల టన్నులుండునని తెలియుచున్నది. అనగ 1946 సంవత్సరములో భారతదేశమున లోటుపడిన ధాన్యమున కిది సమానము. నిలువచేయుటలోని లోపములవలనను, ఎలుకలు క్రిమికీటకములు తేమమున్నగువానివలనను నానా విధములగు వ్యాధులకు అవకాశము లేర్పడుచున్నవి. ఈ నష్టముకూడ అల్పమైనదికాదు.

ఎక్కడిపంట నక్కడ నిలువచేయు నేర్పాటులు సమకూర్చునెడల నిలువలతగుగు క్రిమికీటకముల వలని నష్టము, స్థలాంతరములకు దీసికొనిపోవు కష్టాలు ఎంతగనో తప్పించుకొనగును.

నిలువలజేయు సమస్యను శాశ్వతముగను సత్వరముగను, బహుజాగరూకతతో నాలోచించి పరిష్కారము చేయవలెను. ఏదెట్లున్నను, ఇప్పటివలె సురక్షితముగాని కొట్లలో ధాన్యమును నిలువజేయు ఆచారమును ఆపివేయవలెను.

హెచ్చుగ ధాన్యరాసులను నిలువజేయు పట్టణములందును నగరములందును, సిమెంటుతో పక్కా కొట్లను కట్టించవల

యును. వీనిని మ్యూనిసిపాలిటీలుగాని, ప్రత్యేక వ్యక్తులుగాని నిర్మించిన దాన్యపు నిలువలకై అద్దెల కీయనచ్చును. సహకార సంఘములు వీనిని కట్టుట యింకను శ్రేయస్కర మగును. ఇంజిను బాయిలర్లనువలె, ఈ కొట్లు నప్పుడప్పుడు తనిఖీ చేయించుచు వానికి లైసెన్సుల నొసగుచుండవలయును.

ధాన్యరాసులను అవి పండు గ్రామములలోనే నిలువ జేయుచు, పట్టణములకును, తిరిగి గ్రామములకును ధాన్యమును త్రిప్పు నాచారమును నివారించు నెడల వానికి గలుగు చెడుగుల కవకాశములు చాల వఱకు తగ్గును.

ధాన్యమును నిలువచేయు సక్రమ పద్ధతులను, వ్యక్తులకు గూడ నేర్పుట యవసరము.

ముడిద్రవ్యములను గ్రామములందె నిలుపుట :—

గ్రామ పరిశ్రమలకు గలుగు అనర్థములలో గొప్పది గ్రామ పారిశ్రామికశిల్పి నిరాధారుడుగ నుండుటే. వానితో పోటీకి వచ్చు సకల సౌకర్యములు గలిగి సమర్థమగు వ్యవస్థాపనబలము గలిగియున్న మిల్లు నెదిరించి నిలుచుటకు వాని కేవ్యవస్థయు యొక్క అండయు లేదు. అన్ని వసతులునుగల మిల్లులు దాదాపుగ ముడిపదార్థము లన్నింటిని వశముచేసికొనుచున్నవి; తయారైన వస్తువుల విక్రయ స్థానములను తమ అదుపులో పెట్టుకొను చున్నవి; వ్యష్టిగ నిలుచు శిల్పులను, లవలేశము అండ లేనివారిని జేసి నెట్టివేచుచున్నవి. బ్యాంకుల ఆర్థికనీతియు రైలుచార్జీలలో చూపబడు వ్యత్యాసములును, పెట్టుబడిసాహుకారుల విక్రయశాలా వ్యవస్థాపనలును అన్నియు పెద్దయెత్తున సాగించు

ఉత్పత్తులకు ప్రోద్బలము నొసగుచు వ్యష్టి శిల్పులను సిస్సాహాయుల గావించుచుండెను. ఈ శిల్పులకు వలయు ముడిపదార్థములు గ్రామములలో దొరకుట చాల అరుదైపోయినది. ఈ విధానమంతయు పూర్తిగ సంస్కరింపబడవలయును. గ్రామములలో నుత్పత్తియగు ముడిపదార్థముల నన్నింటిని వాని యుత్పత్తిస్థానముననే నిలిపియుంచి, అక్కడ వినియోగమునకు సరిపోగ, అదనముగ మిగిలిన వానిని మాత్రమే యితరస్థలములకు పోనిచ్చు నియమ మేర్పాటు కావలయును. ఆ యుత్పత్తియందును గ్రామ పరిశ్రమల కనువగు ముడిపదార్థముల అవసరము తీరిన యనంతరమే, ఫ్యాక్టరీల కనువగువాని యుత్పత్తికై పూనిక వహించవలయును.

పరికరముల సరఫరా :—

గ్రామ పరిశ్రమలకు వలయు పనిముట్లను పరికరములును దేశమంతటను, ఇంతేల ఒక రాష్ట్రమంతటను గూడ ఒకే రీతిగ నుండుటలేదు. ఉపయుక్తములగు పనిముట్లను నిర్మాణముచేయుటకు పరిశోధనలు జరిపింపవలసియున్నది.

పలుప్రయోజక సహకారసంఘములు అటువంటి వానిని, వానికి అంగభూతములగు విడిభాగములను సమకూర్చిపెట్టు నేర్పాటులు చేయవలెను.

జిల్లా ప్రదర్శన కేంద్రములు (Demonstration Centres) :—

సహకారసంఘములు గ్రామసీమలందు ప్రయోగకేంద్రములను నెలకొలుపవలెను. అవి నిర్వహింపవలసిన పనులివి :

1. పరికరములను పని ముట్లను తయారుచేసి గ్రామ శిల్పుల కందజేయుట; ప్రాతరకము వానికి మారుగ క్రొత్త, అభివృద్ధిచేయబడిన రకము వానిని ప్రవేశపెట్టుట.

2. సభ్యులకును తదితర శిల్పులకు శిక్షణ గఱపుట, ఆయా పరిశ్రమలలోని నవీనపద్ధతులను వారికి నేర్పుట.

3. శ్రేష్ఠములౌ పనిముట్లను స్థానికములౌ కళలకు సంబంధించిన శ్రేష్ఠతర రచనలను సేకరించుట. ఒక వస్తు ప్రదర్శన మందిరమున వానిని ప్రదర్శించుట.

4. జిల్లాకు సంబంధించిన పరిశ్రమల గుఱించియు, ఆరోగ్య విషయముల గురించియు పరిశోధనల జరిపించుట.

5. గ్రామముయొక్క సామాన్యాభివృద్ధి కొఱకై యితర సహకార సంఘముల తోడ్పాటు తోడను హిందూస్థానీ తాలిమీ పాఠశాల తోడ్పాటుతోడను పనిచేయుట.

# అధ్యాయము 5

## గ్రామ పరిశ్రమలు

పలుప్రయోజక సహకార సంఘములు ముడిపదార్థములను సరఫరా చేయవచ్చును. తయారైన సరకును చేర్చిపెట్టవచ్చును. గ్రామపరిశ్రమల నన్నింటిని ముఖ్యముగ ఆహారము వస్త్రము ఇంక నిటువంటి ప్రాథమికావసర వస్తువులను తయారుచేయుట కుపకరించు పదార్థములను వారివారికి పంచిపెట్టవచ్చును. అవి నిరంతరము గ్రామస్థుల యోగక్షేమములను కనిపెట్టుచుండ వలయును. ప్రధానముగ నీ క్రింది సూచనలను గురించి శ్రద్ధ తీసికొనవచ్చును.

(1) బియ్యము చేయుట:—బియ్యపు మరలను విప్పివేసి, అందలి ఇంజనులను లోగడ తెలిపినటుల, వ్యవసాయమునకు నీరుసరఫరాచేయు పనులకై వినియోగించ వలయును.

(2) బియ్యమునకు మెరుగుపెట్టు కొఱకు నుపయోగపడు హాల్లరులను నిషేధింప వలయును.

(3) మెరుగుపెట్టక తవుడుతో నున్న బియ్యము యొక్క పుష్టిశక్తినిగూర్చి ప్రజలకు తెలుపవలయును. మఱియు ప్రత్యక్షముగచేసి చూపుట పూర్వకముగ ఆబియ్యమును వంటచేయు టెట్లో నేర్పవలయును. బియ్యమునకు మెరుగుపెట్టుటను పూర్తిగ నాపివేయ వలయును, లేదా ఎంతమెరుగు పెట్టుటో నియమించి, కఠినముగ అమలుపఱచునటుల చూడవలయును; లేదా ఉప్పుడు బియ్యము చేయుటను ప్రోత్సహించవలయును.

(4) హెచ్చు వరిపంటగల ప్రాంతములందు, వ్యాపారము నిమిత్తము ఊకను తొలగించువారికి, అధికవ్యయము కారణములగు డెంకీలను, జల్లెళ్ళను ఇంకనిట్టి అవసరములగు పరికరములను, సహకారసంఘముల ద్వారమున గ్రామపారిశ్రామిక కూటముల వారికి సరఫరా చేయవచ్చును.

(5) మెరుగుపెట్టని బియ్యపు వాడుకను ప్రోత్సహించుచు ప్రజాసామాన్య మనుసరించునట్టుల చేయుకొఱకు వడ్లను ఒక చోటునుండి మఱొక చోటుకు రవాణాచేయు టవసరమగును. కావున హెచ్చుస్థలము నాక్రమించుచు హెచ్చుబరువుండు వడ్లను రవాణాచేయుట హెచ్చు వ్యయకారణమగును. అట్టి హెచ్చు వ్యయమును సరిపెట్టు తీరున రవాణాచార్జీలను తగ్గించవలెను.

(6) ఎక్కడ వడ్లపై ఊకను తొలగించుట, బియ్యమును మెఱుగుపెట్టుట యేకరీతి పనిముట్లతో జరుపుదురో, మఱియు ఆరెండు పనులును దంపుటనంటి ఒకేకార్యమువలన జరుగునో అక్కడనెల్ల మెరుగుపెట్టు పనిని తగ్గించునిమిత్తము కొయ్యతో గాని రాతితోగాని లేక మట్టితోగాని తయారుచేసిన చక్కీలను (తిరుగళ్లను) ప్రవేశపెట్టవలయును. అటువంటి పనిముట్లను, ఇంక నితర పరిశ్రమల కవసరములగు పరికరములను జిల్లా ప్రయోగ కేంద్రములద్వారమున సరఫరాచేయవలయును. బియ్యమునకు మెరుగుపెట్టుటను, అట్టిమెరుగుపెట్టు పనిముట్లపైన హెచ్చుగ పన్నుల విధించుట మూలమున నిరుత్సాహపఱచ వలెను. పై తనిఖీని అదుపును ఏర్పాటుచేయుటవలన మెరుగుపెట్టుటందు తారతమ్యము లేర్పాటు చేయవచ్చును.

వడ్లను ఇతరధాన్యములను మఱియు విత్తనాలను గ్రామములో అవసరమగు సంతనటకు ఆగ్రామములోనే నిలువ చేయుచు, అదనముగ మిగులు వాసను మాత్రమే ఎగుమతి చేయ నీయవలెను; అదియు సహకార సంఘము ద్వారముననే జరుగవలయును.

2. పిండి విసురుట:—

(1) ప్రదర్శన కేంద్రములద్వారమున చేతితిరుగళ్ళకు ప్రశేష మగు రకములరాళ్ళను, ఎద్దులతోడను నీళ్ళసాహాయమునను నడుపదగిన తిరుగళ్ళను సరఫరా చేయవలయును.

(2) అతి సున్నితమైన మైదాపిండిని తయారుచేయుటను; ఉపయోగించుటను నిషేధించవలెను.

(3) పిండిమిల్లులలో విశేషముగ ధాన్యమును విసరి, అతి దీర్ఘకాలము ఆపిండిని నిలువచేయుచుందురు. అందుమూలాన పిండి చెడిపోవుచున్నది. కాబట్టి అటువంటి మిల్లులను నిషేధించు టవసరము.

(4) ఎచ్చు టెచ్చట తగు వసతులు గలవో అక్కడ నెల్ల ఎడ్లతో నాడించు తిరుగళ్ళను ప్రవేశపెట్టవలెను.

(5) ఎక్కడెక్కడ నదులయొక్కగాని కాలువలయొక్కగాని ప్రవాహపు నీటివలన శక్తి లభ్యమగునో అక్కడనెల్ల నీటితో త్రిప్పింపగల పిండి తిరుగళ్లను నెలకొలుపవలెను.

(6) పంజాబునందువలె అటువంటి తిరుగళ్ళను సహకార సంఘములుగ గూడిన గ్రామస్థులు నెలకొలుపవచ్చును.

౮. నూనెతీయుట :—

పల్లెటూళ్ళ గానుగలను పునరుద్ధరించుటలో యీ క్రింది చిక్కులు గల్గుచున్నవి :

పంట కల్లాల కాలముననే గ్రామాలనుండి నూనెగింజల నన్నింటిని వెలుపలినుండి వచ్చు వర్తకులు తుడుచుకొనిపోవు చున్నారు. దీనిని నివారించుకొనుటకు గ్రామములో అదనముగ దొరకు నూనెగింజలను మాత్రమే వెలుపలికి పోనీవలెను.

కొన్నిచోట్ల స్థానికముగనున్న గానుగలు చాల లోపములు గలవిగాను, ఛిన్నవిగా నున్నవి. వానింగూర్చి ఆచరణయోగ్య మగు ప్రతిపాదనల చేయుట దాదాపు అసంభవ మనవలయును. ఒకేరాష్ట్రములోనే అనేక విధములగు గానుగలు కానవచ్చు చున్నవి. అటువంటి గానుగ లన్నింటిని పరిశీలించి యొక నివేది కను తయారుచేయవలసియున్నది. సుపరిణామము పొందించిన గానుగలయొక్క నాణకను లాభములను సవివరముగ వెల్ల డించవలయును.

ప్రాతరకపు గానుగలు చేయించుటకును, ప్రస్తుతము తగిన వడ్రంగులు దొరకుటలేదు. వారిసేవ సకాలమున, నూనెగానుగ లాడెడు వారి కందుటలేదు. ఉచితములగు పరికరములును, ఆ యా భాగములును విడివిడిగ దొరకుటయు కష్టముగ నున్నది. అటువంటి వేర్వేఱు భాగములును వానింజేయుటకు తగిన శిక్ష ణమును లభింపగల కేంద్రములందు పనివాండ్రను చేర్చి నూనె తీయువారికిని వడ్రంగులకును సుపరిణామము పొందిన గానుగల గూర్చిన సాంకేతిక విజ్ఞానమును నేర్పవలయును.

నూనెగింజలను ప్రోవుచేసిపెట్టుటకును, కలితీలు లేకుండజేసి విత్తనములయొక్కయు, నూనెయొక్కయు, పిండియొక్కయు ధరలను అదుపుచేయుటకును, తాలూకా సహకారసంఘములు గాని పలుప్రయోజక గ్రామములుగాని మిగుల సమర్థములై యుండును.

4. బెల్లము తయారుచేయుట :—

బెల్లమును తయారుజేయు పరిశ్రమ బాగుగ స్థిరపడి సాగుచున్న బెంగాలు, మదరాసురాష్ట్రములందు, వాణిజ్యమునకు అర్హమగునంత పెద్దయెత్తున తాడిచెట్లనుండి బెల్లము చేయబడుచున్నది.

ఉన్నతాడిచెట్లను సంరక్షించుట, క్రొత్తవానిని నాటుట:— తాడిచెట్లను నఱకివేయుటను నిషేధము చేయవలయును. చెఱకుబెల్లమును, తాడిబెల్లమునుండి సిద్ధము చేయబడు పంచదారను కాలక్రమమున అవసరము లేకుండ వాని స్థానము నాక్రమించుటకు సరిపోవునంతగ తాడిచెట్లను పెంచుటకు, సేద్యమున కనుకూలములుగాని ప్రభుత్వపు బంజరుభూములను వినియోగించవలెను. మఱియు సంసారులకుచెందిన అదేతీరు బంజరుభూములను పొలాల గట్లను తాడిచెట్లను పెంచుకొనుటకై వినియోగించువారికి దొరతనమువారు సాహాయ్యకధనము నొసగవలయును. చాలినన్ని విత్తనములను సరఫరాచేసి, వానిని పెంచు సరియైన విధానమును నేర్పవలయును.

సహకారసంఘములు:—సహకారసంఘములు ఉత్పత్తిని చేపట్టి స్థానికావసరమును దీర్చుటకును, విక్రయించుటకు పూనుకొనస

నలయును. అవసరమగుపట్ల ఆ సంఘములే రసమునుకాచు పళ్లె రములు, సంవృతగతి యంత్రములు (centrifugal machines), ఇట్టి యితర పరికరములను సరఫరాచేయుచు అద్దెలకిచ్చు నేర్పాటులను చేయవలెను.

5. తేనెటీగల పెంపకము:—

తేనెటీగల పెంచుట రెండువిధముల లాభకరము. వ్యవసాయ దారులకు హెచ్చుపంట లభింప జేయునటుల పుష్ప గర్భోత్పాదన (fertilization)కు శ్రేష్ఠతరోపాయము వాని వలన చేకూరును. మఱియు పుష్టికర ఆహారపదార్థమగు తేనెనుగూడ నవి చేకూర్చును.

ఇందుకు తగిన ప్రదర్శన కేంద్రములున్న చోట్ల వానిద్వారము న తేనెటీగలకు పుష్కలముగ తిండి దొఱకు తావులందు వాని కూటములను కొన్నింటిని పెంచి, యీపరిశ్రమను ఇతర గ్రామములకును వ్యాపింపజేయ నలయును. ఇందుకొఱకు గాను తేనెటీగలను పెంచుటలో నిపుణులగు వారిచేత ముందుగ ప్రాంతీ పరిశోధన చేయించు టవసరమగును. ఒకసారి కేంద్రములలో తేనెటీగలను సాకుట సాగిన యనంతరము, వ్యవసాయదారు లకు తగుశిక్షణ గఱపుటకును, అవసరమగు పరికరములను సరస మగు ధరకు సరఫరాచేయుటకును పూనుకొన నగును.

6. ప్రత్తి, ఉన్ని:—

ప్రత్తిపండించుట కనుకూలమగు ప్రాంతములందు, జనాభాలో తలకొక $12\frac{1}{2}$ పౌనులదూది లభింపగల ప్రత్తిని పండించుటకు చాలినంత భూమిని ప్రత్యేకించవలయును. అఖిలభారత చర్ఖా

సంఘమువారు రవలంబించు ప్రణాళిక ననుసరణముగ, దానిని వడుకుటకును, నేతనేయుటకును, సదుపాయముల కూర్చ వలయును.

అదేతీరున గొఱ్ఱెలపెంచు ప్రాంతముల సందర్భముననను, వానిని సాకుటకును ఉన్నిరకముల తీర్చుటకును సాహాయ్యపడుచు ఆ పరిశ్రమను ప్రోత్సహించ వలయును.

7. తోళ్ళనూనుట:—

భారత దేశమునుండి జరుగు పచ్చితోళ్ళయొక్కయు, చర్మముల యొక్కయు ఎగుమతి ప్రపంచములోనికెల్ల గొప్పది. పచ్చితోళ్ళను ఊని సిద్ధముచేసిన చర్మములనుగ మార్చుట మననే చేయగల్గునెడల, లక్షలాది హరిజనులకు వృత్తిని కల్పించిన వారమగుదుము. తోళ్ళనూనుటలో కాలము చాలముఖ్య విషయముగాన, చాల పెట్టుబడి యవసరమగును. కావున ఆపని సహకార విధానము ననుసరించి జరుగవలయును. సహకారసంఘములు పచ్చితోళ్లు మొదలగు వానిని కొనవలయును; చర్మములగాను వారలలో ఆయా పనులుచేయువారలకు జట్టీ పద్ధతిని డబ్బీయవలయును; ఊనిన చర్మములనుగాని, సిద్ధము చేసిన సరకులనుగాని వారలకై అమ్మిపెట్టవలయును.

(1) తోళ్ళ నన్ని రాష్ట్రములందును ఊనుచున్నారుగాని, అన్నియు సమానమగు మేలిరకపు చర్మములుగ నుండుటలేదు. మేలిరకముగ నెంచబడు కలకత్తా క్రోము, చెన్నపురి 'గావి' చర్మములను సిద్ధము చేయుట కితర ప్రాంతములందు ప్రయత్నము సాగించుటలేదు. తక్కిన రకపు చర్మములు నీనికి చాల లొట్టుగనుండును. ఇందుకు కారణముల నరసి కనుగొని, అన్ని

చోట్ల నొకేతీరు మేలిరకపు చర్మముల తయారుచేయు పద్ధతిని ప్రవేశపెట్టవలెను.

(2) ఎగుమతిచేయు పచ్చితోళ్లమీదను, చర్మములమీదను హెచ్చు పన్నుల విధించి వాని యెగుమతిని నిరుత్సాహ పరచ వలయును.

(3) ఒక్కొక్క చర్మకారకూటమున కొక్కొక బండిని స్వల్పపు వెల కిచ్చి చచ్చిన గొడ్లను మోసికొనిపోవుటలో సాయము చేయవలయును. ప్రస్తుత మట్టిసంటి సదుపాయము లేకపోవుటచేత పశు కళేబరములను నేలమీద నీడ్చుకొనిపోవుచున్నారు. ఈ కారణమువలన చర్మముల ధరలో సగానికి సగము నష్టమగునట్లు లెక్క వేయబడుచున్నది.

(4) ఈనాడీ పరిశ్రమ జరుగుపరిస్థితులు అనారోగ్యకరములుగ నున్నవి; వానిని సంపూర్ణముగ మార్చివేయుటవసరము. గ్రామనివాస స్థానములకు దూరముగ నొకచోట చావడులు వేసి గోతులు త్రవ్వి నీటిసరఫరాలకు సదుపాయములుచేయ వలయును. అనారోగ్య విధానములమాని సులభమగు యంత్ర సాధనతో పనులు చేయవచ్చును. ఒక తాలూకాలోగాని, జిల్లాలోగాని అందందు వసించు చర్మకారుల నందఱిని నొక్క చోటునకు చేర్చుటకు వీలున్నచో అటుల చేయుట శ్రేయోదాయకమే కాగలదు. చర్మ పరిశ్రమాలయములు చర్మకారుల స్వంతములుగనుండి ప్రత్యేకము వారియొక్క సహకార సంఘముల చేతనడుపబడు నవిగ నుండవలయును.

(5) ప్రస్తుతము చర్మముతో చేయబడు సరుకులను, పెద్ద యెత్తున సాగించి వానిని దేశమంతట వ్యాపింపచేయు సంస్థలు

చాలకొలది స్థలములందు మాత్రమే కలవు. ఈపద్ధతి నిరుత్సా హపఱుపదగినది. కాళ్ళ చెప్పులు. డబ్బుసంచులు, చేతి పెట్టెలు మొదలగు సరకు లన్నియు ఎక్కడవాని నక్కడనే తయారు చేయుటను ప్రోత్సహించవలయును. స్థానిక పరిశ్రమోత్పత్తికై సాహాయకధనము నొసగవలెను; లేదా! దిగుమతులపై పన్నుల విధింప వలయును.

నెత్తురు, మాంసము, ఎముకలు మున్నగు వానిని గొర్ల కళేబరముల నుండి తీసి వానితో మంచి యెరువులను సిద్ధము చేయు వ్యక్తి కంట్రాక్టరులకు గాని, సహకార సంఘములకు గాని సాహాయక ధనముల నొసగవలయును. అటువంటి సాహాయ కధనములు తయారు చేసిన యెఱువుల మొత్తమును బట్టి నిర్ణ యించవలసి యుండును.

(6) సరేసు, నరపుదారములు బ్రష్షులు మొదలగు అనుబం ధోత్పత్తులను పైసంఘముల వారు తయారు చేయవచ్చును. కొమ్ముపనులు చేయుటను చర్మకారక కుటుంబములందు ప్రవేశ పెట్ట వచ్చును. కొంతకాల మీపనిని సహాయక ధనముల నొస గియు, తయారైన సరకులను ప్రభుత్వము వారు కొనియు ప్రోత్సాహ మొసగ వచ్చును. అవసరములగు పరికరములను అద్దెలకిచ్చు నేర్పాటులను చేయవలయును.

8. సబ్బులపని :—

సజ్జిమట్టి యెచ్చటెచ్చట దొరకగలదో పరిశోధనలు చేయ వలయును. అట్టితావులనుండి సజ్జి మట్టిని పన్నుగాని మరే చార్జీలుగాని లేకుండ సబ్బులు చేయువారిని దీసికొని పోనీయవ

లయును. అట్టి చవురును దీసికొని పోవుట వలన భూమి బాగు పడునని యీసందర్భమున తెలిసికొనవలయును. సజ్జి మట్టిలో నుండి కాస్టిక్కు-లై (Caustic Lye) ని తయారు చేయవచ్చును. ఆహారములో నుపయోగ పడని చముురు గింజల నుండి తీసిన నూనెలను సబ్బులు చేయుటలో నుపయోగించవచ్చును.

9. దీపములు:—

ఆహారమున నుపయోగపడని వేప, గానుగ, బ్రహ్మదండి, యిప్ప మొదలగు గింజల చమురులను ప్రస్తుతము పూర్తిగ వినియోగము చేసికొనుటలేదు. దీపములు వెలిగించు కొనుటలో యీచముురుల నుపయోగించుట చాల లాభకరముగ నుండగలదు. ఈ యంశమున గ్రామములను స్వయం సమృద్ధములుగ చేయుటలో సర్వవిధముల ప్రయత్నములను సాగించవలయును.

ఆయాారకములగు లాంతరులతో పాటు అఖిల భారత గ్రామ పరిశ్రమల వారు తయారు చేసిన 'మగన్దీపము' ను ప్రదర్శన కేంద్రముల ద్వారమున వ్యాపకము చేయుచు అట్టి వానిని ఉత్పత్తి చేయుటలో ఆయా ప్రాంతముల శిల్పులను ప్రోత్సహించగావలయును.

10 కాగితపుటుత్పత్తి:—

(1)అనుకూల పదార్థములు లభించు ప్రాంతములందలి జైళ్ళలో చేతి కాగితము నుత్పత్తి చేయించుటకు ప్రాంతీయ ప్రభుత్వమువారు పూనుకొనవలయును. ఇందుకొఱకై కాగితము చేయుటకు పనికివచ్చు ముడిపదార్థము లెచ్చటెచ్చట దొరకునో

కనుగొనుటకై నిపుణులగు వారి చేత పరిశోధనలు జరిపించవల యును.

(2) కాగితము చేయుట కవసరములగు రసాయనిక ద్రవ్య ముల నన్నింటిని కంట్రోలుధరలకు సహకార సంఘముల ద్వార మున ఉత్పత్తి కేంద్రములకు సరఫరా చేయించ వలయును.

(3) పిండిత్రొక్కు తొట్లు, పిండికలుపు తొట్లు, అచ్చులు నీరొత్తివేయు ఒత్తిడి యంత్రములు, కవరులుచేయు యంత్ర ములు, కాగితములు కోయు కత్తులు మొదలగు నుపకరణముల నన్నింటిని, ఇతర పరిశ్రమలతోపాటు సిద్ధము చేయుటకు కేంద్ర కర్మాలయమును ప్రభుత్వము పోషించవలయును.

కాగితము నుత్పత్తిచేయు పారిశ్రామికులకు బీటరు, కాలెం డరు, స్క్రూప్రెస్సు మున్నగు నవ్య నూతన పరికరములను అద్దెలకుగాని అమ్మకమునకుగాని సహకారసంఘముల ద్వార మున సరఫరాచేయవలయును. ఎచ్చట కాగితపుపిండి చేయు టకు పెద్ద యంత్ర సౌకర్యము లవసరమగునో, ఆతావులందు కాగితపుపిండిని కాగితము నుత్పత్తిచేయు పారిశ్రామికులకు సరఫరా చేయవచ్చును.

(4) కాగితము నుత్పత్తిచేయుటలో నుపకరించు కొఱకు ఆఫీసు ప్రాత రికార్డులను, చిత్తుకాగితాలను ప్రభుత్వమువారి యడవులలో వేలము వేయు గడ్డిని చేతికాగితము నుత్పత్తిచేయు కేంద్రములకై ప్రత్యేకించి యుంచి, సహకార సంఘములద్వార మున సరసమగు వెలలకు సరఫరా చేయవలయును. మఱియు కేంద్రములలో తయారైన కాగితమును ప్రభుత్వపు రికార్డుల

కొఱకును (స్టేషపరీక్షని) సహకారసంఘముల ద్వారమున కాగిత పరిశ్రమలో పనిచేయువారికి ఉచితమగు జీవనపరిమాణ మనుస నటుల ధరలను నిర్ణయించి కొనుగోలు చేయుచుండవలయును.

(5) శిక్షణ:— కాగితమును తయారుచేయు కేంద్రములలో పనిచేయు నిపుణులకు రాష్ట్ర శిక్షణ కేంద్రమునందు శిక్షణ గఱపవలయును.

(6) చేతికాగితమును తత్సంబంధమగు పనిముట్లను రవాణా చేయుటలో రైళ్ళయందు ప్రధాన సౌకర్యముల నంగీకరించ వలయును. చేతికాగితముమీాద ఎగుమతి దిగుమతి పన్నులను రద్దుచేయవలయును.

11 కుమ్మరిపని (కుండలు మొదలగు మట్టి పనులు)

(1) కుమ్మరి వృత్తింగూర్చి మొట్టమొదటగ చేయవలసినపని రాష్ట్రములో దొఱకు రేగడమట్టిని పృథక్కరణ చేయించ వలయును. ఈ పనిని ప్రభుత్వము పూనుకొనవలెను.

(2) రేగడమట్టిని సరియైన పాళ్లలో కలుపుటకు విశిష్టమగు రసాయనిక విజ్ఞాన మవసరమగును. కాబట్టి ఆపనిని సహకార సంఘమునంటి యొక కేంద్రస్థానముననో జైలులోనో సాగించి, అటుల సిద్ధముచేసిన మట్టిని వ్యక్తికుంభకారులకు సరఫరా చేయవలయును, మఱియు ఇప్పుడు కుంభాకారవృత్తి చేయు వారికి ఆ యా రకపు రేగడను కలుపు కళను నేర్పుచు వారికి కొన్ని ప్రణాళికలను తెలుపవలయును.

(3) ఇతరములగు పరిశ్రమలందు వలెనే సహకారసంఘ ముల ద్వారమున కావలసిన రేగడిని, సుపరిణతములైన

కుమ్మరి చక్రములను అద్దెలకిచ్చు పద్ధతిని సరఫరా చేయవలయును.

(4) ప్రత్యేకము కొన్నిరకాల మృణ్మయ పాత్రలను ఆవమున కాల్చుట, వానిని మెఱుగుపెట్టుట సహకార పద్ధతిని చేయవలసి వచ్చును. రేగడిని కలుపుట, పాత్రలను ఆవమున కాల్చి మెరుగుపెట్టుట యను రెండుపనులును కుమ్మరులచేతనే సహకార పద్ధతిని సేవానియమముల ప్రకారమున జరుప నగును. హెచ్చువేడితో కాల్చు నవసరము లేనట్టియు ప్రస్తుతము మామూలు కుమ్మరులు ముఠాలచేత కాల్చబడుచున్నట్టియు కుండలను, ఎప్పటికప్పు డమర్చు ఆవములలో గాక ఉత్తమ తరగతి కొలుములలో కాల్చు పద్ధతిని ప్రవేశపెట్టవచ్చును. సక్రమముగనిర్మించినఆవములలో కట్టెలకర్చుకూడతక్కువయగును.

ఇటుకలు, పెంకులు కాల్చుటకు వలయు పెద్దపెద్ద ఆవములను సహకార పద్ధతిని నిర్మించవచ్చును. ఈ ఇటుకలయు పెంకులయు పరిమాణమును బలమును అభివృద్ధి గావించవలయును.

(5) రేగడిని కలుపుటలోను క్రొత్తక్రొత్త అచ్చులను వాడుక చేయుటలోను, ఆవమున వేయుటలోను మెరుగులు పెట్టుటలోను, సదవకాశములు గలచోట కుమ్మరులకు కొలది కాలపు శిక్షణముల కేర్పాటులు చేయవలయును.

**12 పారిశుద్ధ్యము—ఎరువులు.**

(1) వేర్వేఱు పద్ధతులను వినియోగించి పరిశోధించిన పిమ్మట ఏ యే గ్రామములలో మఱుగుదొడ్ల నేతీరున కట్ట వలసియుండునో నిర్ణయము చేయవలయును. ఒకటిగాక హెచ్చు

రకపు మఱుగు దొడ్లను నిర్మించుట అనుకూలమును అవసర మును కావచ్చును. గ్రామములను పరిశుద్ధముగనుంచు నిమి త్తమై ఎట్టిమఱుగు దొడ్లను కట్టవలయునో తెలియుటకు వేర్వేఱు ప్రయోగముల గావించి కనిపట్టవలయును. గ్రామ ములలో మూత్ర విసర్జనకై 'బోర్హాలు' మఱుగుదొడ్లు వాడుక ప్రవేశపెట్టవలయును.

(2) మానవుల పురీషమును గ్రామపు చెత్తచదారములను ఎఱువుగ మార్చు సందర్భమున వ్యష్టి కంట్రాక్టరులకు సాహా యక ధనముల నొసగవలయును. వారు తయారుచేసిన యెఱు వుల పరిమాణముల ననుసరించి యీబడు సాహాయకధనము వ్యక్తుల నాపనికై ఆకర్షించునట్టిదిగ నిర్ణయించవలెను.

(3) గ్రామపారిశుద్ధ్య దృష్టిరీత్యా పశువులను గ్రామముల మధ్యను, మఱియు నివాసగృహములలో సయితముకట్టి వేయు టను గుఱించి జాగ్రత్తతీసికొనవలసి యున్నది. ఈ సమస్య పూర్తిగ పరిష్కారమగుటకు విశేషకాలము పట్టినను, పశుశాల లకు దగినయేర్పాటులను చేయనియెడల, గ్రామపారిశుధ్యమును సంరక్షించుట చాలకష్టమగును.

ఎచ్చటెచ్చట గ్రామములనుగాని పట్టణములనుగాని విస్తీర్ణ మును పెంపుచేయుటకు పూనుదురో, అచ్చట పశువులనుంచు తావులు నివాస ప్రదేశములకు దూరముగ నుండునట్లేర్పాటు చేయవలయును. ప్రత్యేకముగ వ్యక్తులు పశువులనుపెంచు పద్ధతికి మారుగ గ్రామసమష్టి క్షీరాలయముల నిర్మాణము కావలయుననువారు గ్రామపారిశుధ్యమును చాలముఖ్య సమ స్యగా నెంచవలయును.

# అ ధ్యా య ము 4

## ప్ర జా స్వా మ్య ప రి పా ల న ము

భారతదేశము మొదటినుండి ప్రజాస్వపరి పాలనగల గ్రామముల కూటముగ నుండెను. ప్రతిగ్రామమును స్వతంత్ర పరిపాలనగల ప్రదేశమే. సమాజములో సామాన్యముగ కానవచ్చు ప్రజల భిన్నవైఖరులపై నాధారపడు రాజ్యముంగూర్చిన కొన్ని భావములీదేశమున పరిణతిగాంచినవి.

సంఘప్రజల ప్రవృత్తులన్నింటను రెండు దృక్పథములు స్పష్టపడుచుండును. ఒకటి దీర్ఘసూత్రము; రెండవది ప్రాప్తకాల సూత్రము. దీర్ఘసూత్రమును పూనుటన మనలో చాలమందికి హితవుగ నుండదు. ఏలయన ఫలము గుర్తించుటకు గాని, అనుభవించుటకుగాని సంవత్సరముల కొలది కాలము శ్రమపడి నిరీక్షించు చుండవలసి వచ్చును. అటుల వేచియుండుటకు ప్రజలొప్పరు. మనకందఱకును ప్రాప్తకాల సూత్రము హితవుగ నుండును. ఎప్పటికప్పుడు తినుట త్రాగుట కేళింతలుకొట్టుటన మనకుప్రీతి. నూటికి తొంబది తొమ్మండుగురు ప్రాప్తకాల సూత్రమునే కోరుకొందురు. ఐనను, సమాజమంతటి క్షేమము కొఱకై నిర్వహింపవలసిన కొన్ని కార్యములు కలవు; వానికి దీర్ఘ సూత్రము అవసర మగును. ఇందు కొఱకై యే ప్రజారాజ్యము పాటుపడును. ప్రభుత్వము విజయవంతముగ సాగవలయునన్నను, అధికసంఖ్యాక ప్రజలక్షేమమును సాధింపవలయునన్నను, దీర్ఘసూత్రావలంబులు ప్రభుత్వాధి పత్యము నడుపుట యవసరమగును. ప్రాప్తకాల సూత్రావలంబులు

ప్రభుత్వము నడుపువారుగ నున్న యెడల సమాజమునకు అపాయము వాటిలగలదు. వారు తమ ప్రాపంచదృష్టి విధానముల మూలాన యుద్ధముల ప్రోత్సహింతురు.

ఈ దృక్పథముతో చూచు నెడల అమెరికా యింగ్లాండులు ప్రజాస్వామికములనుటకు నెంత మాత్రమును వీలు లేదు. ఈ దేశములు పూర్తిగ నిరంకుశ అధికారుల పాలనక్రింద నున్న వన వలయును. ఈ దేశములను యుద్ధమహా ఘోరార్థము లెవరు ర్కొనినప్పుడు, అందు ప్రబలియున్న ప్రభుత్వము లెట్టివిగ నున్నవి ? ప్రజాప్రభుత్వములా ? లేక నిరంకుశాధికార ప్రభుత్వములా ? నిరాఘాట నిరంకుశాధి పత్యములక్రింద నీదేశము లున్న వనుట తెల్లమే. ఇయ్యది తాత్కాలికమా ఆగంతుక సంఘటనకాదు. అవి అనివార్యముగ సంఘటించినవియే. ఈ దేశములు కేంద్రీకృత ఉత్పత్తి విధానముల ననుసరించుచుండిరి. కేంద్రీకృతాధిపత్యము అనగ ఏకీకరణ పద్ధతి అన్నమాట. తుద కివి నిరంకుశ ప్రభుత్వమునకు దారితీయును. ఆర్థిక క్షేత్రమున నిరంకుశ పాలనమును, రాజకీయములందు ప్రజాస్వామ్య పరిపాలనమును సంఘటిలుట కల్ల. ప్రజాస్వామ్యవాదము అటువంటి సందర్భములందు "పొగ తెర" చాటువంటిది మాత్రమే యగును. ఆర్థికవిషయమున వికేంద్రీకరణము అభ్యసనలయు నన్నచో గ్రామములలోని వ్యష్టి నాధారము చేసికొనిన వికేంద్రీకృత మగు ఉత్పత్తి మూలాధారముగ నుండవలయును.

నీటికాలవలపై నాధారపడు వ్యవసాయము, రోడ్లు, ఇంక నిట్టి పెద్దపెద్ద యుద్యమములు నిర్వహించవలసిన మాట నిజము. అందునిమిత్తము దీర్ఘ సూత్రావలంబులగు పురుషులను సమా

జము నుండి యేర్చుకొనవలసి యుండును. కావున మంత్రులందఱును ప్రభుత్వోద్యోగు లందఱును దీర్ఘసూత్రావలంబులుగ నుండవలెను. వారు డబ్బును దృష్టిలో పెట్టుకొని 'అది లాభదాయకమా?' అని శంకించునెడల, ఇప్పటి బాధ్యత గల పదవులందు నిలుచుట కర్హతగల పురుషులు కాజాలరు. 'దీర్ఘసూత్రావలంబమున అది లాభదాయకమా' అనెడు విచారణ పెట్టుకొందగినది కాదు. 'ప్రజల యుపయోగమున కది సరిపడునా?' అను నదియే విచారణ యోగ్యమగు ప్రశ్నయై యున్నది. ప్రభుత్వము వ్యాపార సంబంధమగు వ్యవస్థ కాదు. అది డబ్బుసంపాదనకొఱకు గాని అధికారదుర్వ్యామలను గాని సిద్ధముచేసిపెట్టుకొనుట కగు వ్యవస్థ కాదు. ప్రభుత్వ మనునది ప్రజాసేవ కొఱ కేర్పడిన వ్యవస్థ. అది ప్రజల అవసరములను దీర్చుట కుపకరించునెడల, ఆసేవ యెంత వ్యయ కారణమైనను సంకోచింపపని లేదు. ఆ సేవ యొనర్చియే తీరవలయును. అదియే మనము జ్ఞప్తిలో నుంచుకొనవలసిన ప్రధానసూత్రము. ప్రభుత్వపు కోశము సందర్భమున అనుసరింపదగినది దీర్ఘసూత్ర విషయము, వ్యక్తుల ఆర్థిక సంపదకును ప్రభుత్వ కోశమునకును మధ్య గల గొప్ప భేదమును నిరూపించును. ప్రజాస్వామ్య ప్రభుత్వ నిర్మాణమునందు, ప్రతి పౌరుడును సమష్టిని ఆయ వ్యయమునం దంతటను తాను నిర్వహింప వలసిన భాగమును గ్రహించునటుల చేయవలసియుండును.

ఉద్యోగము:—

ఇది సిద్ధించవలయుననినచో, అధికార పదవులందున్న వారి యందు "స్వార్థ" మ్మనునది ఉండరాదనుట అత్యంతావసర

మగును. వారిలో "స్వార్థ" మున్న యెడల, వారు కోట్లాది జనుల శ్రమ ఫలమును హరింపజూతురు. అది అపాయ హేతువగును. కాబట్టి కాంగ్రెసు మంత్రివర్గముల సందర్భములో అనేక విషయములు మార్పుచేయవలసినవి కలవు. గత మంత్రివర్గములవారు నెలకు 500 రూపాయిల పరిమితికి జీతముల తగ్గించుకొనిరి. ఇప్పుడు వారి హోదాలు హెచ్చినవి. వారి జీతములును పెరిగినవి. వారిలో 'స్వార్థము' పునఃప్రవేశము గాంచినదని అర్థము. ఇందపాయ మెంతయోగలదు. మనము గ్రామ మర్యాదలను గ్రహింపవలసి యున్నాము. మనము రాజభవనములందు నివసింప కోరదగదు. నగరములందు ఘన మందిరము లుండును. అందు ధనికులు నివసింతురు. కాని గ్రామములలో రాజమందిరము లుండవు.

పట్టణమునకైదారుమైళ్ల దూరమున నున్న ఒక పల్లెలో మిషనరీ దొర నొకని కలిసికొనుట తటస్థించినది. మనమంత్రులు నివసించు మహాభవనములనుబోలు ఒక పెద్ద భవనమును ఆయన కాపురము చేయుచుండెను. ఆ భవనము సకల సదుపాయములతో నమర్చబడి యున్నది. అదొక యడవి ప్రాంతమైనను వానికి విద్యుచ్ఛక్తి సదుపాయములు గలవు. బావులలో పంపులున్నవి. నవ్యతర విధానమున నిర్మించిన మరుగుదొడ్లు, మరెన్నియో సౌకర్యములు అత డనుభవించు చున్నాడు. మూడువందల యకరముల భూమి కతడు యజమాని.

వాని యింటినుండి యరమైలు దూరాన ఆదర్శనివాసము లనబడు గుడిసెలు కొన్నియున్నవి. గోడలు మట్టివి. అందు వసించు కుటుంబములు ఆదర్శప్రాయము లట. ప్రతిగుడిసె

దాపునను కొళ్లకు గూళ్లు వ్యవసాయము చేయుటకు కొంత భూమి యుండెను. ఆ మిషనరీ నాతో నిట్లనెను. "మేమిక్కడ చాల సొమ్ము వ్యయము చేయుచున్నాము. అయినను గ్రామ మును ఉచితరీతిని ఉంచజాలకున్నాము. ఈ జనులతో పరిచ యము కూర్చుకోజాలకున్నాము. మీరేమైన మంత్రమును దెలుపగలరా ?" నే నిట్లంటిని "మంత్రమా, సులభమైనదే కలదు. రాజప్రాసాదము వంటి మీ యింటికి నిప్పుపెట్టుము. అయ్యదియే మంత్రము ! మీరు పాశ్చాత్యదేశముల నుండి వచ్చినారు. భారతదేశములోని స్థితిగతులను మీ రెఱుగరు. మీరు సదా డబ్బును దృష్టిలో పెట్టుకొని తంత్రముల సాగిం తురు. తద్వారమున మీకు పలుకుబడి వచ్చును. ఈ దుస్తులను వేసికొనినందున గ్రామవాసులు మనను గౌరవించుచున్నారు. మన దుస్తులలో మరి రెండు ప్రేరికలను చేర్చి కుట్టునెడల నింకను మర్యాద నూపుదురు. మీరు షర్టును తీసివేసితిరా వారు మి మ్మనుసరించి వత్తురు. మోకాళ్ళపైకి కొళ్లాయిగుడ్డ వలె ధోవతిని గట్టితిరా, వారు మీ మ్రోల సాగిలపడగలరు. మా దేశములో మర్యాదగణన యీ లీల నుండును. మిషనరీ లుగ నిక్కడకు వచ్చిన మీ కా పరిస్థితులు తెలియవు. కాబట్టి మీరు మా ప్రజల కుపకరింపవలయు నన్నచో, వారిని పీల్చుకుతిని లాభము నందజూతు రను భావమును స్ఫురింప జేయు ఈ మహాభవనమును విడిచివేయవలసియుందురు. వానిని చూచుతోడనే మీయెడ సంశయము దోచును; గ్రామవాసులు మిమ్ము జూచి భీతిలుదురు. ఈ గుడిసెలలో నొక్కొక్కదాని మీద 250 రూపాయలు ఖర్చుపెట్టి మట్టితో కట్టినపుడు, మీ

రీ గ్రామస్థుల కుపకారము చేయదలతురేని 125 రూపాయలు ఖర్చుచేసి మీరు నొక మట్టిగుడిసెను కట్టుకొనవలయును. అటుల చేసితిరా మీలో స్వార్థము లేదని వారు గ్రహించి మీరు బోధించుదానిని వినగలరు. డబ్బు విలువను పాటించని విలువగల సంప్రదాయము కలవారము.

నేను మాకు మా 'బ్రాహ్మణ సంస్కృతి' కలదు. బ్రాహ్మణ సంస్కృతికి చిహ్నము జందెము కాదు. వేలకొలది రూపాయల జీతములు పుచ్చుకొనువారు జందెముల ధరించు ఐ.సి.యస్. ఆఫీస ర్లుండవచ్చును. ఐనను వారందరు మ్లేచ్ఛులే. బ్రాహ్మణ సంప్రదాయపు విలువల పాటించు సభ్యత మాది. గాంధీమహాత్ముని గొప్పతనమున కదియే రహస్యము. గాంధీ మహాత్ముడు అమెరికాకు పోవునెడల ప్రజలు గుంపులుగుంపు లుగ వానిం జూడవత్తురు. కాని ఆ ప్రజలను ప్రేరేపించునట్టి భావములతో మా భారతప్రజలు వానిం జూడబోరు. గాంధీజీ స్వార్థము లేనివాడును, ఆస్తి లేనివాడు నగుటచేతనే మా ప్రజ లకు వానియం దత్యంత విశ్వాసము కలిగినది. అదే ప్రజా పక్ష మంత్రివర్గములకు యథార్థ మగు అధికారము నొసగు చున్నది. అది ప్రజల మనస్సులలో వారియందు విశ్వాసము నెలకొలుపగలదు. ఈ ప్రణాళికను మీరు వారియెదుట బెట్టితి రేని వారు మిగుల ఆప్యాయనముగ దానిని స్వీకరింతురు. ఇందుకై మీకడ హెచ్చు డబ్బు ఉండ నగత్యము లేదు.

కావలసినదంతయు మనము సంస్కారము పొంది మన మట్టి జీవితవిధానము నవలంబించుటయే. దానివలననే మనకు

ఆర్థిక స్వరాజ్యము ప్రాప్తించగలదు. ఆ స్వరాజ్యమునందు ప్రతి వానికిని తినుటకు తిండి తగినంత దొరకగలదు.

పేద దేశమునందు ప్రప్రథమముగ నెల్లఱకును తిండి గుడ్డకఱ వుండరాదు. ఈ సమస్యను వ్యవసాయకులను దృష్టిలో నుంచుకొని మనము పరిష్కరింపవలయు ననుట కిదియే కారణము. ప్రజల దేశాభిమానము నంతను కేంద్రీకరించి వినియోగించుకొను టెట్లా యను సమస్య కా దిది. ఎట్లైనను ప్రతి వానికిని అన్నవస్త్రముల సమకూర్చు సమస్యను మనము పరిష్కరించి తీరవలయును.

ప్రపంచమున శాంతిని స్థిరముగ నిలుపుట కిది యొక్కటియే మార్గము. మనకు చీనా దేశముపైన గొప్ప పలుకుబడి యున్నది. అది మనము పరమాణుబాంబుల చేయుటలో నేర్పరుల మగుటవలన సంపాదించుకొనినది కాదు. అయ్యది బుద్ధ భగవానుడు మన దేశమునకును చీనా దేశమునకునుమధ్యకూర్చిన బంధుత్వ మహిమ. మన కిప్పుడు కావలయునది అట్టి సంస్కృతియే. కాబట్టి మన మటువంటి సంస్కృతి యొక్క అభిమానముతో ప్రారంభించవలయును. గ్రామములతో ప్రారంభించి పైకి పోవు ప్రణాళికలను రచించుకోవలెను. మన సమస్యలనే గాక యావత్ప్రపంచ సమస్యలను పరిష్కరించుట కది యొక్కటే మార్గము. ఈ వ్యవహారనౌకను నడుపు కర్ణధారులు తమ స్వార్థబుద్ధిని త్యజింపవలయును; తమ సర్వస్వమును అర్పణ చేయవలయును. ప్రజాక్షేమము నిమిత్తము వారీ ప్రణాళిక నాచరణలో పెట్టవలయును. వారు మన దేశమునకు చేయగల ఉపకృతి అదియే.

ప్రభుత్వ ప్రతిపక్షము:—

ప్రజాప్రతినిధులతో నేర్పడిన ప్రభుత్వమునకు, దానిని సక్రమముగ నడుపు నిమిత్తము ప్రతిపక్షమొకటి యుండవలయును. నదిలోని జలమును హద్దులలో నడుపునవి దానికట్టలే. ఆ కట్టలు రాతికట్టడము లగునెడల మిగుల లాభకరము. లేకున్నచో కట్టలు కోతబడిపోవును; నదిలో ఒండుపేరుకొనిపోవుచు, దాని మార్గమును మార్చివేయును. కాబట్టి నదీస్థలి నాక్రమించుకొను కొఱకు నదిగట్టులకును దానిలోని నీటికిని మధ్య స్పర్థ (పోటీ) యనునది యుండదు.

అదేతీరున చోదకుడును (Director) వానిచే నడుపబడువారును (the directed) పోటీదారులు కాజాలరు. ఉండవలసినది సహకారమే గాని స్పర్థ కాదు.

రాతిగట్లు నదిని హద్దుమీరక నడుపు విధాన ప్రభుత్వమునకు వెలుపల నుండు శక్తుల వలన దేశపు ప్రభుత్వము క్రమమార్గమున నడుపబడును. గ్రేటుబ్రిటను తమకు "మదర్ ఆఫ్ పార్లమెంటు" మాతృభూత ప్రతినిధిసభ గల దని చెప్పుకొని గర్వించుచుండును. అచ్చట ప్రభుత్వపు ఖర్చుతో 'సామ్రాట్ప్రతిపక్షమును' పోషించు పద్ధతి కలదు. ప్రభుత్వము చేయునట్టిగాని, చేయనెంచునట్టిగాని కార్యములపైకి బహిరంగ విమర్శాకాంతిని బఱపి మంత్రులను అదుపులో నుంచుట కా సామ్రాట్ప్రతిపక్ష ముపకరించుచుండును. బ్రిటిషు పార్లమెంటనగ రాజకీయ యోధాగ్రేసరులు జట్టీపట్లు పట్టుటలో ప్రాణము లర్పించు వినోద రణక్షేత్రమై (Arena) యొప్పు ననవచ్చును. ఓడిపోయిన యోధుడు పదభ్రష్టుడై విజయునికి తన

పదవి నర్పించును. ఆ పార్లమెంటులో జరుగు చర్చల ఫలితముగ నేడు ప్రతిపక్షపీఠము నలంకరించువారు, రేపు సగర్వముగ కోశాగార పాలకవర్గమున నాసీనులు కానగును. బ్రిటిషు పార్లమెంటు విధానమున ప్రతిపక్షము యొక్క ప్రయోజన మిటు లుండును. స్పర్థాపూర్వక ఆర్థిక నిర్ణయములను రాజకీయరంగమున ప్రవేశపెట్టుట వలని ఫలితార్థమే యిది.

వారి మంత్రివర్గ నిర్మాణము ఆర్థిక క్షేత్రమునందు సామ్రాజ్యనిర్మాణ వైఖరులను ప్రతిబింబించుచుండును. కేంద్రీకృత పరిశ్రమలకొఱకు ప్రపంచపు నాలుగు చెఱగుల నుండియు ముడిపదార్థములను ప్రోవుచేసి తమ సిద్ధవస్తువులను భూగోళపు దూరప్రాంతము లన్నింట గల విక్రయస్థానములకు తిరిగి పంపుచుందురు. దీనికొఱకు అతి విస్తారమైన డబ్బు వినియోగము రవాణా సౌకర్యములు, ప్రభుత్వాధికారముల వశీకరణము అవసరములగును. ఇట్టి విదేశాంగ వ్యవహారముల నిర్వాహణ నిమిత్తము, ధనకోశము, సేనలు, నౌకాదళములు వాయు విమానదళములు ప్రధానము లగును. కాబట్టి బ్రిటిషు మంత్రాంగమున వీనికి మహా గౌరవపదవి చేకూరినది.

స్పర్థకు సామ్రాజ్య తత్వమునకు రెంటికిని పునాదులు హింసయందు నెలకొని యుండును.

మన దేశీయులిప్పుడు ప్రభుత్వపు పగ్గములను చేతబూని యుండిరి. మనము దౌర్జన్య రాహిత్యమును అనగ అహింసా విధానమును కోరుకొను నెడల మన ప్రభుత్వ మెటువంటి స్వరూపమును దాల్చ వలసియుండునో ? మన ప్రభుత్వమును

క్రమగతిని నడుపుచుండుట కొఱకు 'ప్రతిపక్షము' అవసరి మగును. ఐనను మన అర్ధనీతిని స్పర్థ (పోటీ) మీద కాకుండ సహకారము పైని నిర్మింప గోరుచున్నాము. ఏసమయము నందైనను అధికార పదవులందున్న వారికి ప్రతికూలముగ చర్యా ఫలితములు తేలిన యెడల ప్రతిపక్ష సభ్యులు కొంగపదవుల నాక్రమించుటకై నిరీక్షించుచుండుట మన ఆర్థిక విధానమున ప్రధానము కాదు. అహింసాసహకారములపై నాధారపడు మన ఆర్థిక నిర్మాణము నందు మత్సరములకు తావులేదు. మనము సాధింప కాంక్షించునది ఉన్న మంత్రుల తొలగించి క్రొత్త వారి నాపదవులలో నిలుపుట కాదు; వా రనుసరింపదగిన ఆదర్శ ముల నిరూపించి చూపుటయే; నిర్మాణ కార్యక్రమమున పాల్గొనువారలు తమతమ ఆదర్శ రూపవర్తన మనెడు దివ్వెను జూపి సక్రమ మార్గములకు మంత్రులను ద్రిప్పుటయే మనపర మార్థము. అహింసాపూర్వకపూ ఆర్థిక విధానమున నిర్మాణ కార్యక్రమము పూనువారి భుజముల మీద అధికమగు బాధ్యత పడుచున్నది.

సత్యమార్గమున నడుపు నీశక్తిని సమకూర్చుటకు సుస ర్శితపూ నిర్మాణ కార్యక్రమమును చేపట్టిన ప్రచారకులు కావలసి యున్నారు. ప్రజలకు వారొనరించు సేవయే వారికి అనుమతిని చేకూర్చును. వారు నిర్వహించు కార్యక్రమము యొక్క యోగ్యతయే వారికి అధికార పత్రము. అటువంటి సంఘమునుండి మంత్రులు ప్రోత్సాహమును బడయుదురు. వారు మతాచారములందు దప్ప తక్కిన యంశములందు ప్రభుత్వ మున కాదేశముల నొసగ జాలుదురు; నడుపను జాలుదురు.

ఈ కార్యకర్తలు అట్టి ధర్మమును నిర్వహించ సమర్థులు కావలయు నన్నచో త్యాగశీలురగు పురుషులను చేర్చి తమసంఘము నేర్పాటు చేసికొనవలయును. వారి ఆశయము వారి గమ్యార్థము ప్రజా సేవ యొక్కటియే యైయుండవలయును.

ఆ తీరు రాజకీయ నిర్మాణమునందలి మంత్రిమండలి స్వయంసమృద్ధముగా ఆర్థికస్వాత్వమున కాధారభూతము లగు పరిపాలనాశాఖలను చేబూనగలరు. అందు వ్యవసాయము, సస్యక్షేత్రాభివృద్ధి, భూమి నీటిచే కొసికొనిపోకుండ సంరక్షించుట నిరుపయోగమైపోయిన భూములను తిరిగి సాగులోనికి దెచ్చుట, భూమినిసారవంతముచేయుట, నీటిపారుదల, నదీప్రవాహములను అదుపులో నుంచుట, అడవులు, గ్రామములు, కుటీరపరిశ్రమలు, ఖనిజములు, భూరి పరిశ్రమలు, ఆరోగ్యము, విద్య, స్వదేశాంగతంత్రము మున్నగునవి ప్రధాన రాజ్యాంగ శాఖలుగ నుండును. అటువంటి నిర్మాణ కార్యములందు, విదేశాంగ వ్యవహారములు, కోశాధిపత్యము, దేశరక్షణ శాఖలెంత ఘనమైనవైనను, వానికి ప్రత్యేకముగ మంత్రులుండవలసి నంత హోదా నీయ నక్కర లేదు.

ఇట్టి స్వభావముగల రాజ్యాంగ నిర్మాణము నందు నిర్మాణ నిపుణులగు ప్రచారకులు ప్రజలు మోసగాండ్ర చేతిలో బాధల పాలుకాకుండ రక్షించుకొనుటకై నిలుతురు. ఈపునాదులపై నిర్మితమైన ప్రభుత్వము ప్రజల క్షేమలాభములకే ప్రాధాన్యత నిచ్చి, ప్రజాసామాన్యము చేతులలో స్వరాజ్యాధికారమును బెట్టి పోషించు భారము వహించగలరు.

'జాతీయము చేయుట' అనినచో యథార్థ మగు అధికారము ప్రజల చేతులలో ప్రధానముగ సామాన్య ప్రజానీకము చేతులలో నుంచుటయని యర్థము. మొట్టమొదటగ నున వ్యవహారముల నన్నింటిని నిర్వహించుటకు దగిన విశాలానుభవము యొక్క ప్రబలాధార ముండవలయును. సమర్థముగ నిర్మింపబడిన పంచాయతీల ద్వారమున తమ సమిష్టి సామాన్యావసరములను దీర్చుకొను నేర్పును గ్రామవాసులు సంపాదించుట యవసరము. అటుల నిర్వాహము గావించు అనుభవ శాలురగు పురుషులనుండి జిల్లాలు తమపరిపాలక బృందము నెన్నుకొనును. వీరి నుండి రాష్ట్రవ్యవహార నిపుణులును, శాసన నిర్మాణకులును సమకూరగల్గుదురు. ఆతీరుగ సునిర్మితమై సక్రమముగ నడుచు రాష్ట్రప్రభుత్వములు కేంద్ర ప్రభుత్వమును అదుపులో నుంచగల్గును; దానిని గ్రామవాసుల యోగక్షేమముల సంరక్షించు నటుల చేయగల్గును.

కోట్లాది ప్రజలక్షేమలాభముల రక్షణయే తమప్రప్రథమ ధర్మముగ జేసికొని వర్తింతురని విశ్వసింప బడగల దేశభక్తుల చేతులలో దేశపరిపాలనము సుస్థిరముగ నుండునాడే మనకు జాతీయ ప్రభుత్వ మబ్బినదని చెప్పుకో గల్గుదుము. పరిపాలనమును అప్పుడు 'జాతీయముచేయుట' వలన ప్రజాసామాన్యము యొక్క యోగక్షేమములు నిరపాయముగ నుండునను హామీాధృవ పడగలదు.

గ్రామము పునాదిగ నుండి అదుపులో పెట్టబడి నడుచు కేంద్రప్రభుత్వమమరు వఱకు 'కలవారి చేతులలో లేనివారలు' మఱింతనలిగి పోకతీరదు.

ఉదాహరణకు చూతము : ఆకాశమార్గములను జాతీయము చేయుటంగూర్చి యిటీవల హెచ్చుగ ప్రగల్భము లాడ సాగిరి. ఈ ఆకాశమార్గములు ప్రస్తుతము గ్రామ ప్రజల కందుబాటులో లేవు. వారికి వాని అవసరము లేదు. మఱియు వారు వానిని ఉపయోగించుకొనను కోరరు. ఇప్పుడు జరుగుచున్నటులే యికమీదటను 'కలవారే' వానికి యజమానులుగ నుండి, వానిని వినియోగించుకొనుచుందురు. కాబట్టి యీ సందర్భమున ప్రభుత్వపు ఆధిపత్య మనగ ప్రభుత్వమువారు బుద్ధికౌశలమును ధనమును ఆకాశ మార్గములను 'కలవారికి' అందుగడలో నుంచుకొనుటకు వ్యయముచేయుదురు; మరి 'లేనివారి' కందు కవసరమగు సేవా గణముగ నేర్పఱుదురు. విమాన యానాశ్రయములు నిర్మాణము చేయవలసి యుండును; అనేకములగు రోడ్లను సిద్ధము చేసిపెట్ట వలసియుండును. ప్రభుత్వాధిపత్యము లేక జాతీయాధిపత్యము అను సాకుతో కలవారి ముఠాలు ప్రభుత్వ ధనములను స్వార్థమునకై వినియోగము చేయించుచు తాము లాభముల బడయుచుందురు. నిజమునకు ప్రభుత్వము నొక్క ధనము ప్రత్యేకము ప్రజాసామాన్యపు సౌకర్యముల నమర్చుకొనుటకై వినియోగపడవలసి యుండును గాన, ఆ ధనమును 'ఆకాశమార్గముల'ను వృద్ధిచేయుటకై దుర్వ్యయము చేయజాలము. ప్రత్యేకపు సంఘము లేనేని యేర్పడి, అటుల చేసికొనిన చేసికొందురుగాక. కొందఱు 'కలవారు' మఱికొందఱు కలవారిని దోచుకొందురు గాక. గ్రామముల యాధారముపై నెలకొలుపబడిన జాతియ ప్రభుత్వము మనకు సిద్ధించినప్పుడు, అటువంటి ప్రభుత్వశాఖల నేర్పాటుచేసికొను యత్నమును సాగించుటకు మన కవకాశ మెంతేని లభింపగలదు.

# అధ్యాయము 7

## జాతీయ పరిశ్రమలు

ఇప్పుడు పరిశ్రమలకైన నిర్మాణముల స్వాతంత్ర్యము, ప్రణాళికల ననుసరించుటయు నెట్లో విచారింతము. ఆర్థిక విషయమున రెండు ప్రధాన సూత్రములను మనస్సున నిడు కొనవలసి యుండును. సంపదను ప్రోత్పుచేయు సూత్ర మొకటి; సంపద వినియోగసూత్రము రెండవది.

కేంద్రీకృత పరిశ్రమలు సామాన్యముగ సంవృతగతిని నడుచుయంత్రముల బోలియుండును. సీనివలన సంపదలు కొందఱి హస్తములందు మాత్రము ప్రోవుపడును. కేంద్రీకృత మగునది ధనము కావచ్చును లేదా అధికారము కావచ్చును. వికేంద్రీకృత పరిశ్రమలు సహజముగ సంపదను పంచిపెట్టుట కుపకరించును. కాబట్టి మనసమాజములో సంపదయొక్క కేంద్రీ కరణమును కోరనియెడల కేంద్రీకృత పరిశ్రమలను తొలగించి వేయవలయును. ముఖ్యముగ భారతదేశము వంటి పేద దేశ ములో సంపదను పంచిపెట్టు విధాన మవసరమై యుండుటనుగాన మన పరిశ్రమలను వికేంద్రీకరణము చేయవలయును.

దీనిని యింకొక విధమునను సాధింపవచ్చును. రష్యా దేశము దానిని చేపట్టినది. వారు కేంద్రీకరణ విధానమున సంపద నుత్పత్తిచేసి, దానిని ప్రభుత్వము ద్వారమున పంచి పెట్టుదు మందురు. వారి అనర్థము అధికార కేంద్రీకరణము నందున్నది; మనదేశములోవలె సంపద కేంద్రీకరణమునందు లేదు. సంపద ఉత్పత్తియైన పిమ్మట, దానిని తిరిగి పంచిపెట్ట

వలసిన ప్రజల చేతులలో అధికారము నెలకొనును. అమెరికా లోను ఇంగ్లాండులోను సంపద కేంద్రీకృతమై యుండగ రష్యాలో అధికారము కేంద్రీకృతమై యున్నది. భారతదేశము పేద దేశము. ఇచ్చట మనము సంపద నుత్పన్నము చేయవలసి యున్నాము. అటుల సంపద నుత్పత్తి చేయు విధానములోనే దానిని పంచిపెట్టవలసియున్నాము. కాబట్టి నిత్యోపయోగావసరము లగు సరకులను ఉత్పత్తి చేయుట మనకవసరము, కావున కేంద్రీకరణ విధానము మనకెంత మాత్రమును పనికిరాదు.

కేంద్రీకృతమగు ఉత్పత్తియొక్క స్థానము:—

లాభాల కాశపడనట్టిగాని, లేదా సంపదను కేంద్రీకృతము చేసికో గోరనట్టిగాని ప్రజలచేతిలో పరిశ్రమ లుండగల చోట ఉత్పత్తిని కేంద్రీకృతము చేయవలసినదే. కేంద్రీకృతమైన ఉత్పత్తుల నడుపువారి చేతులనుండి సంపదను కేంద్రీకృతము చేసికొనగల అధికారమును లాగివేయ వలయును. అటుల చేయు మార్గ మేది? సేవా విధానమున దానిని సాధింపవలసి యున్నది. విద్యుచ్ఛక్తి, రవాణా, రాకపోకలు, పోస్టుటెలిగ్రాములు, రోడ్లు మొదలగున వన్నియు సేవా విధానముపై నాధారపడియుండి, స్వార్థభావ రహితులగు పురుషులచే నేర్పడిన ప్రభుత్వముచేత నిర్వహింపబడవలసి యుండును. మనకు మోటారుకారులుగాని, ఆకాశ విమానాలుగాని అవసరమగు నెడల వానిని ప్రభుత్వమువారే నిర్మాణము చేయించవలయును. కాని అటువంటి పరిశ్రమలు దొరతనమువారు నడుపు నెడల, తఱచుగ దుబారా వ్యయమగు నను వాదము కలదు. కొంత దుబారా యగుటను క్షమింపవచ్చును. సంపద కేంద్రీకరణము

ంతకన్న దుబారా వ్యవహారమగును. ఇప్పుడు వచ్చిన పెద్ద సన్న యుద్ధము లన్నియు కేంద్రీకృత సాధనములను అందు మూలాన కేంద్రీకృతమైన ఉత్పత్తులకును సహజముగా ఫలితాంశములే. గడచినకొలది సంవత్సరములలో దుబారాచేయబడిన విశేష ధనరాసుల విచారించుడు.

మనము కేంద్రీకృతమైన ఉత్పత్తులను చేపట్టవలసి వచ్చునేని, అవి అనివార్యము లగునప్పుడే, వానిని అంగీకరింప వలయును. అవి విషమువంటివి. విషము సయితము కొన్ని సమయములం దుపకారమును చేయును. ఉదాహరణకు నీవు కొయినా (quinine) మందు వేసికొందు వనుకొనుము. దానిని స్వల్పపు మోతాదులోను, డాక్టరు నియమించిన పద్ధతిలోను నీవు సేవించు నెడల మంచిదే. కాబట్టి దానిమీద విషమని తెలుపు ఎఱ్ఱచీటీ నంటించుదురు. దానిని అతిస్వల్పముగ నుపయోగింతురు. కేంద్రీకృత పరిశ్రమమున కవసరమగునట్లు దానిపైన నొక ఎఱ్ఱచీటీ నుంచి, డాక్టరు నిర్ణయించు రీతిని స్వల్పపు మోతాదులతో స్వీకరింపవలయును సుడీ! లేదా అనర్థము మూడును. కేంద్రీకృత పరిశ్రమ లనిననే, స్వభావ సిద్ధముగ సంఘ విరుద్ధమైనది. కావున వాని క్షేత్రము కొలదిపాటిదిగ నుంచవలయును. వానికి హద్దులు నిర్ణయించు టెట్లు? అట్టి పరిశ్రమ సహజముగనే గుత్తగొనిన వ్యవహారమునంటిదిగాన, అవి యెంతవఱకు సంఘమున కవసరములో అంతవఱకు హద్దులలో పెట్టుడు. నీటిసరఫరా విషయము తీసికొనుడు. ప్రభుత్వమును నీటిసరఫరా చేయనీయవలసినదే. అటుల దీర్ఘ సూత్రము అవసరమగు విషయములందు ప్రభుత్వమును నియమింపవలసినదే.

వ్యయము లాభము:—

వ్యయదృష్టితో మాటలాడువా రుందురు. సరకులు చవకగ తయారుచేయు వీలగును గాన కేంద్రీకృత పరిశ్రమలు మంచివని వారు వాదింతురు. ఎల్లప్పుడు ఆ మాట నిజము కాదు. నైజముచేతనే గుత్తవ్యాపారమువంటి రైళ్లు, పోష్టు టెలిగ్రాములు, విద్యుచ్ఛక్తిసరఫరా, నీటి సరఫరాలవంటి బహు ప్రజా వినియోగముల సందర్భములో కేంద్రీకృత పరిశ్రమలు లాభప్రదము లగును. అవియు లాభాపేక్షతో నడుపబడ దగదు. సేనాదృష్టితోడనే వానిని నడుపవలయును. వ్యష్టి నరుని మనస్సులో లాభచింత ప్రాధాన్యత వహించును. ఈ వ్యవహారములను ప్రభుత్వము చేపట్టి నడుపు నప్పుడీలాభచింత అంతర్ధానమగుచున్నది.

వ్యక్తి నరునికి ప్రోద్బలము నిచ్చునది లాభాపేక్ష. ఖర్చు హెచ్చైనకొలదిని లాభము తగ్గుచుండును; ఖర్చు తగ్గినకొలదిని లాభము హెచ్చుచుండును. కేంద్రీకృత పరిశ్రమలందు ఖర్చు తగ్గించు చుండుమని అర్థము. అటుల చేయుటకు తేలిక మార్గము కూలి తగ్గించుట, ముడిపదార్థములను తేలిక ధరలకు కొనుట, మొత్తము వ్యవహారములో ఆర్థికముగ వ్యయములు తప్పించుకొనుటయే ఇందు ప్రధాన ప్రేరణశక్తి లాభప్రాప్తి. మనము కూలిని తగ్గించు నప్పుడును, ముడిద్రవ్యములను చవకగ కొనునప్పుడును, పరిశ్రమ స్థాపకుని నొక్కని శ్రీమంతుని చేసి యితర ప్రజాళిని పేదల చేయుచున్నాము. ఈ రీతిగ సంపద పంపిణీలో విభేదమేర్పడు చున్నది.

గ్రామ పరిశ్రమల సందర్భములో ట్లగుట లేదు. ధరలు పెరిగినపక్షమున గూడ లాభప్రాప్తియను ప్రశ్నరాదు యుండును. ప్రతివానికిని న్యాయమగు ప్రతిఫలము లభింపగలదు. కావున నే గ్రామ పరిశ్రమలవలన ధరలు హెచ్చినను, కేంద్రీకృత పరిశ్రమ వలన ధరలుతగ్గినను మనకు విచారముండనగదనుట స్పష్టము. మనము కోరుకోవలసిన దంతయు సంపద పంపిణీలో అసమానత్వము రాకుండ జాగ్రత్త పడుటయే.

ధరల అదుపు :—

ధరలను అదుపులోనుంచు సందర్భమున పెద్దయెత్తు పరిశ్రమలను చిన్నయెత్తు పరిశ్రమలను ఒకే విధముగ పాటించుట పొరపాటు, అదుపుచేయ బూనుటకు పూర్వము ఆ పరిశ్రమయొక్క స్వభావమును గ్రహించవలయును. ప్రతిసందర్భమునను అదుపుచేయుట వాంఛనీయము కాజాలదు. సంఘక్షేమమునకు విరుద్ధములగు పరిశ్రమల సందర్భమున దాని వికేంద్రీకృత పరిశ్రమగనుండ నంగీకరింప దగదు. కాబట్టి సంఘక్షేమ విధ్వంసకమగునా యనెడు విషయము, ఒక పరిశ్రమ పెద్దయెత్తు పరిశ్రమకాదగునా కాదగదా యను సమస్యను పరిష్కరింప గల్గును.

ఇదివఱలో తెలిపినటుల స్వభావముచేతనే యెచ్చట గుత్తవ్యాపారములు కలవో, ఎచ్చట అధికమగు పెట్టుబడి యవసరమగునో ఆసందర్భములందు కేంద్రీకృత పరిశ్రమలు ఉచితములగును. ఉదాహరణకు బొగ్గుగనులు త్రవ్వించుట, రైళ్లు నడుపుటవంటి వ్యాపారములలో అత్యధికమగు పెట్టుబడియు, పెద్దఎత్తున కూలీలశ్రమయు అవసరములగును. అటు

వంటి పరిశ్రమలు వ్యష్టిమానవుల చేతులలో వదలివేయ దగదు; ప్రభుత్వమే నిర్వహించవలయును.

పరిశ్రమలలో ప్రజాధిపత్యము:—

బట్టల మిల్లులు ప్రజాస్వామ్య ధర్మమునకు విరుద్ధ ములు. మిల్లునేడు స్వల్పక్షేత్రమున నిరంకుశుడగు నొకా నొక దంభుని క్రింద వేలకొలది ప్రజలు ఊడిగము చేయు చుందురు. వాని నోటిమాటయే శాసనము; అతడు పూర్వపు రష్యాచక్రవర్తియగు "జారు" వంటి నిరంకుశ ప్రభుడై అధి కారము చెల్లించును. వానిమాట చొప్పున నెల్లరు తలవంచి పనిచేయ వలసినదే. ప్రజాస్వామ్యమున అటువంటి సంఘ విరుద్ధములగు నంశములకు అవకాశమెంత మాత్రము నుండ దగదు. ప్రజాస్వామ్యమనునది సర్వత్రా విరుద్ధముగ నుండవల యును. ఇట్టి రాజకీయ దృక్పథమునుండి చూచునెడల కేంద్రీ కృత పరిశ్రమలు అనర్థములే యగును.

మనము కోరుకొనునది సహకారముపై ఆధారపడి నిర్మితమగు సమాజము. స్పర్థయనునది అడవి పరిపాలన మగును. మన దేశమున నది మనకక్కఱలేదు. మనలక్ష్యము సహకారము; పోటీమనకు నిషిద్ధము. మనము ధరలను అదు పులో నుంచుదుమను పలుకులో వానిని పలికినంతమాత్రాన స్పర్థను, అనగ పోటీలను అరికట్టజాలము.

డాక్టరు తనకడకు వచ్చు రోగులను బాగుగ పరీక్షించి బహుస్వల్పపు మోతాదులో మాత్రమే విషమును సేవింప చేయ నిర్ణయించు విధమున, ప్రతి పరిశ్రమను పరిశీలించిన

మీాదట, అందు కేంద్రీకరణము నంగీకరింపదగునా, అంగీకరింప దగదాయను సంశయమును నిర్ణయించ వలసియున్నది.

కేంద్రీకరణమును నిషిద్ధము చేసినంత మాత్రాన మనము యంత్రప్రయోగమునకు అభ్యంతరము చెప్పువారము కాము. మనము కోరునదెల్ల, నరుడు యంత్రమునకు దాసుడై పోదగదనియే, నరుడు యంత్రముపై యాజమాన్యమును కోల్పోవునపుడు, హింస తనంతటతాను ప్రభవించుచున్నది.

హింస, శాంతి:—

అర్థశాస్త్రముంగూర్చిన పలు గ్రంథములందు, సరఫరా గిరాకి అనుచు నేనేమో సూత్రముల జదువుచుందుము. కాని యథార్థ ప్రపంచమున, ప్రధానముగ స్పర్థరాజ్యమునందు అటువంటి దేదియు కాన్పించుటలేదు. ఆర్థిక ప్రయోజనము రీత్యాలభింపగల యంత్రోత్పత్తినంతను చేయవలసినదే. విస్పష్టమగు నుదాహరణమును దెల్పెదము. చెప్పులు తయారు చేయు ఫ్యాక్టరీ యొకటి కలదనుకొనుడు. మూడువందల చెప్పుల జతలకు గిరాకే యున్నది. కాని ఆర్థికముగ ఆ ఫ్యాక్టరీలో ఐదువందల చెప్పులజతలను ఉత్పత్తి చేయగలము. అనగ ఉత్పత్తివ్యయము కనిష్ఠ పరిమితిలో నుంచు కొఱకు 500 జతల చెప్పులను, గిరాకీ యున్నను లేకున్నను, తయారుచేయవలసి యుండును. ఫ్యాక్టరీ యజమాని లక్ష్యమంతయు లాభప్రాప్తి మాత్రమే గాన ఒక్కొక చెప్పుల జతను తయారుచేయు వ్యయము కనిష్ఠపరిమితిలో నుంచుట తప్ప యితర విషయము లతనికి పట్టవు. ఉత్పత్తివ్యయము కనిష్ఠ పరిమితిలో నుంచునను కారణమున, అతడు 500 జతలను సిద్ధము చేయించునప్పుడు

గిరాకీ విషయమును ఉపేక్షించి, పిమ్మట వానిని వెలుపల అమ్ముటకై అంగళ్లకొఱకు వెదుక నారంభించును. ఈ తీరుగ నగుచు తన యంత్రపు వేగము ననుసరించి వ్యవహరించును; గాని గిరాకీ ననుసరించి వర్తించదు. కావున అధికోత్పత్తి చేసిన సరకు నిమిత్తము దూరాన నున్న అంగళ్లను స్వాధీనము చేసి కొనుటకును, కొనుగోలుదారులకు కనిపట్టుటకును యుద్ధములకు దిగును. మొదట ఉత్పత్తినిచేసి, పిమ్మట ఆయుధప్రయోగ సాహాయ్యమున గిరాకీ సృష్టిచేయ జూచుచున్నాడు. కాబట్టి కేంద్రీకృత పరిశ్రమలు సంగ్రామములకు కారణభూతము లగు నని తెల్లమగుచున్నది. కావున కేంద్రీకృతపరిశ్రమల వినియోగ మునకు ఉచితమగు హద్దును పెట్టుట అవసర మగుచున్నది.

తోళ్లూనుటవంటి కొన్ని పరిశ్రమలందు పెద్దయెత్తున నవలం బింప నలసిన పరిశ్రమవిధానములు కలవు. అట్టి సందర్భము లందు నిస్సందేహముగ అటుల చేయవచ్చును. కాని ఆపని వ్యష్టినరుల యాజమాన్యమున జరుగదగదు. గ్రామమునందింగు అవసరమగు నెడల ఆ పనిని పలుప్రయోజక సహకార సంఘ ముల ద్వారమున జరిపి, చెప్పులు కుట్టువారికి, గిట్టుబడి ధరలకు చర్మమును సరఫరా చేయవలయును.

అదే విధమున వ్యక్తుల నాధారమునగాని, లేక స్వల్పపు పెట్టుబడి ఆధారమునగాని జరుపదగిన వ్యవహారములు చాల యుండును. ఉదాహరణకు 1600° డిగ్రీల వేడి యవసరమగు పెద్ద పెట్టుబడి లేకుండను, విద్యుచ్ఛక్తి సరఫరాలేకుండను లభిం పదు. అందుకై కేంద్రీకృత ప్రయోగము లగత్యము లగును. ప్రయోగార్థము విద్యుచ్ఛక్తిని మఱియు ఇతర విధానములను

వినియోగింప దగును. కాని లాభములుతీయు దృష్టిలో కాగూడదు. ఆ కార్యము సంఘమును నోచుకొనుట కొక సాధనము కారాదు.

## అధ్యాయము 8

## ప్రభుత్వ ధర్మము

దీర్ఘసూత్రము, ప్రాప్తకాలసూత్రమనెడు రెండు దృక్పథముల ననుసరించి యిక్కాలపు సంఘ చర్యలన్నియు సాగుచుండెనని చెప్పియుంటిమి. వ్యక్తి సామాన్యముగ వెంటనే కలుగు లాభముకొఱకై ప్రాకులాడును. తన యనంతరము ఫలప్రదము కాగల కార్యక్రమమునందు అంత ఉత్సాహమును చూపడు. పిదప నెన్నడో ఫలోన్ముఖమగు కార్యమునకై యత్నించుట కంటె వెంటనే లభించు స్వల్పప్రయోజనముతో నాతడు తృప్తి నందును. కావున సమాజమంతటి క్షేమమును గోరి దీర్ఘసూత్ర ప్రయోజన విధానముల నెరవేర్చుట కొఱకై కొందరిని యేర్చి నియమించుట జాతీయ ప్రభుత్వధర్మమై యున్నది.

సామాన్య పౌరునకు లభ్యమగు కొద్దిపాటి సౌకర్యములతో, నతడు అవసరమగు కార్యములనే కొన్నింటిని చేయజాలడు. అట్టివానిని ప్రభుత్వము విస్తారమైన తనవస్తు సంపదతోడను, మానవశక్తితోడను, నిర్వర్తింప బూనవలసియుండును. పరిశోధన (Research), ప్రయోగము (Experimentation)వాస్తా ప్రచారము మున్నగు పనులను వ్యక్తిత్వేనా నొక కర్షకుడుగాని, శిల్పిగాని తలపెట్టి నిర్వహింపజాలడు.

ఇప్పటివరకు, దేశమందలి కార్యోత్సాహము, ప్రతిభ, సౌకర్యములు నన్నియు మిల్లువస్తువుల నధికముగ నుత్పత్తి చేయుకొఱకే వినియోగింప బడుచున్నవి. ఇకనుండి వానిని గ్రామపరిశ్రమ లాధారముగ గల గ్రామస్వయం సంపూర్ణతకై వినియోగ పఱచవలయును. గ్రామీణులు ప్రస్తుత మనుభవించుచున్న కష్టములను, దృఢ ప్రయత్నమున వెంటనే నిర్మూలింప వలసియుండును.

వ్యవసాయము:—

గ్రామములన్నిటికి వ్యవసాయపు వసతులు ఇంకోధికముగ సమకూర్పవలయునని మిక్కిలిగ చెప్ప నవసరము లేదు. వ్యవసాయాభివృద్ధికి యివ్యనియే పునాది. ఇవి సమకూరనినాడు వ్యవసాయము కేవలము బూటకమగును. బావుల నిర్మించుట, చెఱువులను శుభ్రపఱచి అభివృద్ధిచేయుట, కాలువలను త్రవ్వుట కొనసాగింప వలయును. ధాన్యము పిండిమరలలో ఉపయోగించుచున్న యంత్రములను ప్రభుత్వము తీసికొని గొట్టపు బావులనుండి నీటిని తోడుటకు వినియోగించ వలెను. నీటి వసతు లేనిచో మంచిఎరువు వేయుటకు వీలులేదు. నీరులేనిచో ఎఱువు హానికరమగును.

భూ నిర్వాహకము:—

సాగుబడిలోనున్న భూవైశాల్యమును పెంచి, బలమును వృద్ధి పొందింపవలయును. సరియగు పాఱుదలలు కల్పించుట ద్వారా నీరు నిలువకుండచేసి, కట్టలు వేయుటద్వారా ఒడ్డులు ఒరుసుకొని పోకుండ అరికట్టి, భూమిని సారహీనమై పోకుండ

కాపాడ వలయును. పరిశీలించుచూ ఈదకు ప్రజలకు వలయు ఆహారమునకును పశువులకు కావలయు మేతకును ప్రధానా ధారమగునది భూసారమే. భూమిసారము తగ్గినయెడల అందు పండు పంటయొక్క పుష్టి నశించి, ప్రజారోగ్య భంగమునకు కారణమగును. అందు వలననే ఆహార నిపుణులు ఆరోగ్యమునకు, వ్యవసాయమునకు సన్నిహితసంబంధముకలదని వచింతురు.

బీహారు మున్నగు రాష్ట్రములందు ధరలపెంచు నుపాయముగా, పూర్వము పండు వరివంటి ఆహారపు పంటలకు బదులు వాణిజ్యపు పంటలగు చెఱకును, పొగాకును, పొడవు ఏసుగల ప్రత్తిని పండింపసాగిరి. ఆదేశీయన మలబారులో వరి పొలముల నన్నింటిని కొబ్బరి తోపులుగ మార్చివేయుచుండిరి. కొబ్బరి కాయలను నూనెమరలకు అమ్మివేయగా వానినూనె సబ్బులు తయారు చేయుటకు వినియోగింప బడుచున్నది. అందుచే పూర్వము వరి పొలములు కలిగినవారు, దంపుడు బియ్యము లభింపక బ్రెజిలు దేశమునుండి దిగుమతియైన మెరుగు పెట్టబడిన ధాన్యముపై నాధారపడవలసినవారై అనారోగ్యమునకు గురియగుచుండిరి. ప్రాథమికావసరముల ముందుగనుత్పత్తి చేయుటకు పొలములను తగు విధమున ఉపయోగించునట్లు చూచుట ప్రభుత్వ కర్తవ్యము. ఆహార వస్త్రాదుల నుత్పత్తి చేయుటకు పోగా మిగిలిన పొలములలో మాత్రము వాణిజ్యపు పంటలు పండింపవచ్చును. పై నుదహరించినట్లు ప్రజలు తిండిలేక మాడుచుండగా వరిపొలములు సబ్బులనిర్మాణమున కుపకరించు భూములుగ మార్చబడుట ప్రభుత్వము నెడ ధర్మభంగము పొటమరించుటను తెలుపుచున్నది.

పైరులువేయుటకు లైసెన్సు విధానము అమలు పఱుప వలెను. సునిశ్చితమయిన ప్రణాళిక ననుసరించి కొన్ని కొన్ని పంటలనే పండించునట్లు వ్యవసాయకులకు లైసెన్సులనిచ్చి అదుపు చేయవలయును.

పరిశోధనము (Research) :—

వ్యవసాయ పరిశోధనమంతయు, గ్రామ పరిశ్రమల కవస రములగు ముడిపదార్థములను ఆహారపు పంటలను వృద్ధిపొంద జేయుటకే ఉపయోగపడ వలయును. అంతేగాని ధనార్జన కొఱకై పండింపబడు పొగాకును గట్టి బెరడుగల చెఱకును పొడవు ఏనుగల ప్రత్తిని పండించు కొఱకు కాదు.

రవాణా సుంకములు, సౌకర్యములు:—

ప్రస్తుతము మిల్లుసరకులకే ప్రధానముగ ప్రోత్సాహము ఒసగబడుచున్నది; సరసమగు ప్రత్యేకపు రేవులు అంగీకింపబడు చున్నవి. గ్రామ పరిశ్రమోత్పత్తులగు చేతికాగితము, గ్రామ పరిశ్రమల కగు సాధనసామాగ్రి చముురుదీపములయు రవాణాల యెడ రైల్వే అధికారులు ప్రేకగంటనైన చూచుటలేదు. అందు వలన ఆ పరిశ్రమలు కుంటుపడుచున్నవి. యుద్ధకాల పరిస్థితు లందొకింత వ్యాప్త్యభివృద్ధులు గాంచు నాసగొలిపిన గ్రామ పరిశ్రమలు, రైళ్లలో అనుసరింపబడుచున్న విధానాల వలన నణగారి పోయినవి. ఇతర విషయములందు వలెనే, గ్రామ మందలి ఉత్పత్తిదారుల కనుకూలముగ గ్రామ పరిశ్రమలయెడ సారి దృష్టి మారి తీరవలయును. గ్రామపరిశ్రమల కవసరమగు సాధన సామాగ్రికి రవాణా సౌకర్యములు కల్పించవలయును.

గ్రామోత్పత్తులమీద మ్యునిసిపల్ పన్నులు మున్నగునవి విధించుట మానవలయును.

పశుపోషణ:—

పశుపోషణ శాలలను పెద్దయెత్తున ప్రభుత్వము నిర్వహింప బూనవలసి యుండును. ప్రతిరాష్ట్రమునందు ఆయా ప్రదేశముల కనుకూలములుగ నుండు ప్రత్యేకశాలలున్న యెడ, వానిని భద్రపఱచి, బాగుపఱచ వలయును. అవసరములగుపట్లు ఆబోతుల పోషణకు సాహాయ్యకధనము నొసంగ వచ్చును. మధ్యపరగణా యందలి వార్ధా గోసేవాసంఘము యొక్క పశుపోషణ విధానమును అనుసరింప దగును.

రాకపోకలు! బాటలు :—

గ్రామములో మోటారులు నడుచుటకు తారు రోడ్లను వేయించవలెను. వాటి కగు వ్యయము మోటారు యజమానులు భరింప నగును. పెట్రోలు మోటారుబండ్లమీద లైసెన్సులు, పన్నులు విధించి ఆధనమును కారు యజమానులనుండి రాబట్టి బాటలనిర్మాణాభివృద్ధులకు వెచ్చింపదగును. తారులేని బాటలమీద, ప్రత్యేకానుమతితో తప్ప, మోటారుబండ్లను పోనీయరాదు. పోనిచ్చుట తప్పనిసరియైన యెడల, గంటకు ఐదుమైళ్ళ వేగముకన్న ఎక్కుడు వేగముతో పోనీయరాదు.

అటవీ నిర్వహణమునందు ప్రభుత్వము తనవిధానమును పూర్తిగ మార్చుకొన వలసియుండును; ఆదాయపుదృష్టితోగాక, ప్రజానపరముల దృష్టిని అనుసరింపవలెను. అడవులలో వంటకు కలప, లక్క మున్నగునవి ఉపయోగపడు రూపములో

ప్రజలకు లభ్యమగునట్లు చూడవలయును. కలపను అడవులలో నాన వేసి బాగుపఱచవలయును. చుట్టుపట్లనుండు గ్రామీణుల అవసరముల ననుసరించి వనపాలనా విధానము (Forest Planning) జరుగవలయును. అడవులను రెండు ముఖ్యమగు తరగతులుగ భాగింపవచ్చును. (1) కలపనొసంగు అడవులు. వీని పరిపాలనము దీర్ఘసూత్రము (Long range view) ననుసరింపదగును. (2) వంటచెఱుకు పచ్చిక నొసంగు అడవులు; డబ్బు లేకుండగాని, స్వల్పధరలకుగాని వాటిని ప్రజలకు లభ్యమగునట్లు చేయవలయును. తాటి బెల్లమును కాగితమును కుండలను చేయుట మొదలైన గ్రామపరిశ్రమల కవసరమగు గడ్డి మున్నగునవి చౌకధరలకు లభ్యమైనచో గ్రామ పరిశ్రమలు ప్రబలగల్గును.

శిక్షణకేంద్రములు:—

ఈ క్రిందికార్యముల కొనసాగించు నిమిత్తము భాషా ప్రయుక్త శిక్షణ కేంద్రముల నిర్మించుట ఉత్తమము.

(1) రాష్ట్రమందలి గ్రామపరిశ్రమల నిర్వహణ విధానములందు జిల్లా ప్రదర్శన కేంద్రములతోపాటు పరిశోధనలు జరుపుట.

(2) స్థానిక భాషలలో గ్రామపరిశ్రమలం గూర్చిన వాఙ్మయమును సృష్టించుట.

(3) గ్రామపరిశ్రమల ప్రదర్శనశాలలను నెలకొల్పుట.

(4) జిల్లా కేంద్రములలో నుత్పత్తి కాజాలని ఎద్దులతో నాడించు పిండి తిరుగళ్లు, ధాన్యమునుండి యూకను వేరుచేయు

డెంకీలు, పంచదారను తయారుచేయు సంవృత శక్తి యంత్రములు (centrifugal Machines) ఘట్టన యంత్రములు, పిండి యంత్రములు మున్నగు వానికి కావలసిన పనిముట్లను పరికరములను నుత్పత్తిచేయు పరిశ్రమలను స్థాపించుట.

(5) జిల్లా ప్రదర్శన కేంద్రములకు, సహకార సంఘములకు అవసరములగు సిబ్బందికి, గ్రామసేవకులకు శిక్షణమిచ్చుట.

## అధ్యాయము 9

జీవితప్రయోగమైన విద్య:—

దీర్ఘ సూత్రము, ప్రాప్తకాల సూత్రము నను రెండు దృక్పథముల ననుసరించి యిక్కాలపు సంఘ చర్యలన్నియు సాగుచుండునని చెప్పియుంటిమి. ఒక సామాన్య దృక్పథము నుండి జీవితాదర్శమును గ్రహించునట్టుల ప్రజలకు ప్రబోధము చేయుట ద్వారమున మాత్రమే మనము చిక్కులు తీర్చుకొన గల్గుదుము. మన జీవితముయొక్క సమస్తాంశముల లోనికిని ప్రవేశము నొసగగల సర్వోపయుక్తమగు తాళపుచెవియే విద్య.

విద్యయన నర్థమేమి?:—

శ్రేష్ఠతర పౌరులుగను శ్రేష్ఠతర భర్తలుగను శ్రేష్ఠతర జనకులుగను చేయుచు జీవితమునకు మనను అర్హులను చేయుటకు విద్య యుపయోగపడవలసి యున్నచో ఆ విద్య ఉయ్యాలలో బరుండు పసితనమునుండి స్మశానమున సమాధిజేయు వరకును ఎడతెగక సాగివచ్చు శిక్షణగ నుండవలయును. పలు విధముల మార్పు చెందుచుండి జీవనరంగము లన్నిటను

తొట్రుపాటులేక మనపాత్ర నిర్వహణముచేయు శక్తిమంతుల నుగ చేయుట కది యుపయోగించ వలయును. అటులగాక, కొన్ని చమత్కారములను చేయుటను మాత్రమే ఆ విద్య మనకు నేర్పున దగునెడల, భిన్నమగు పరిస్థితుల నెదుర్కొని నప్పుడు మన మగాధసముద్రమున బడినవార మగుదుము. విద్యయనునది ఏవో కొన్ని యుదంతములను కొన్ని అంకెలను మన తలలో క్రుక్క నక్కఱలేదు. కాని, అది మనకు జీవితా దర్శమును చూపగవలసి యున్నది.

విద్యావిధానమునకు వెనుక ఒక ధర్మసిద్ధాంతము అండగ నుండవలయును. ప్రతివ్యక్తిలోని శ్రేష్ఠతమాంశమును ప్రకాశమునకు దెచ్చుటే దాని పరమ లక్ష్యము. కాబట్టి విద్యాప్రచారమునకు పూనుకొనుట గురుతర బాధ్యతను వహింపు చుటే; అందు అపాయములు మెండుగ నుండును. సక్రమ యోచనయు ఉచిత శిక్షణమునులేనిది, మన మేలాటి ప్రణాళికను ఉదాసీన భావముతో ప్రకటింప దగదు.

దురదృష్టవశాన, చదువను వ్రాయను నేర్పు కళను వ్యాపింపచేయుటే విద్య యగునను భ్రాంతిలో పడిపోయి యున్నాము. ఇంతకంటె వైపరీత్యము మఱొకటి లేదు. వ్రాయుట చదువుట యనునవి సంస్కృతి (culture) నలవరచుకొనుటకు ఒక సాధనము కావచ్చును. కాని అవిమాత్రమే సాధన మనుటయు చెల్లదు. మఱియు అవి అత్యంతము ప్రధాన మనుటకును వీలులేదు.

లక్ష్యశుద్ధిగల విద్య:—

అనేక దేశములలో నిక్కాలమున స్పష్టమగు లక్ష్యములు గల విద్యాపద్ధతులే కలవు. పెట్టుబడిదారుల దేశములలో పరిశ్రమల నడుపు సాహుకారులు భావికాలమున తమకు దొరకగల కార్య నిర్వాహకులు, వ్యవహర్తలు సిద్ధమగుటకు దగిన కృషిక్షేత్రముగ విద్యాప్రచారము చేయింతురు. సాంఘిక వాద దేశములలో హెచ్చుగ సరకుల నుత్పత్తిచేయు సాధనగ విద్యా విధానమును వశము చేసుకొని నడుపుదురు. రణ నీతి వాద, దేశములలో విద్యయనగ సంకుచిత దేశాభిమాన ప్రేరణ మని అర్థము.

ప్రాచ్యవిధానము:—

మన దేశములో ప్రాచీనకాలమున నవలంబించిన విద్యా విధానము జీవితము కొఱకగు శిక్షణ నొసగు క్షేత్రమై యొప్పెడిది. విద్యార్థి తన గురువును వరించి తన యనుదిన జీవితమును ఆ గురువు పర్యవేక్షణక్రింద గడపుచు, వాని యున్నతభావము నలవఱచుకొనెడి వాడు. ఈ విధానమును ఆధ్యాత్మిక శిక్షణము నందేగాక, అనుదిన జీవితమున ప్రత్యంశము నందును అనువర్తించెడి వాడు. తండ్రి యెట్లు తన పితృధర్మములను ఉద్యోగ విధులనుగ నెంచజాలడో; అట్లే గురువు విద్యాబోధను చేయుట ఒకానొక యుద్యోగధర్మముగ నెంచెడువాడు కాడు. గురువు తన జీవితమును తాను గడుపుచు పోవుచుండ, అందు జీవన పరమావధి ప్రస్ఫుట మగుచుండును. అప్పుడు శిష్యుడు గురువు యొక్క ఆచరణను కనిపట్టి తాను నేర్వగల ధర్మమును నేర్చు కొను చుండెడివాడు. ఏసుప్రభుడు తన శిష్యులతో 'నన్ను నను

రించుడ'ని చెప్పిన సందర్భమున ఆయన వారికి పఠనీయగ్రంథ ముల నొకదానిని వారి కీయలేదు. వారు తమ గురుపాదచ్ఛాయల ననుసరించి వర్తించెడివారు. ఇది మన విద్యావిధానము.

యథార్థాకృతిక ప్రభావము:—

పాశ్చాత్య వాణిజ్యసరణితోడి సమీప సంసర్గము మన విద్యాస్వర్ణ దేవతకొక పవిత్రాలయమును నిర్మించిపెట్టినది. మన సంస్కృతికి గల పూజ్యత ధనదేవతయొక్క పూజ్యతకు లోకువై పోయినది. మనము పాటించిన మానవత్వ దృష్టిని వీడి, సువర్ణదృష్టి నవలంబించినాము. బ్రాహ్మణ సంస్కృతి ప్రభావము పోయి వైశ్య నాగరకము పాశ్చాత్య దేశముల నుండి వచ్చిపడినది. బ్రాహ్మణుడు తన సంపదల వలనగాక, తనకు రాగల ప్రతిఫలమెంత యనెడు నాశను వీడి యతడు సంఘమునకు నిష్కామముగ నొనర్చిన సేవకుగాను గౌరవ మర్యాదలను పొందెడివాడు. ప్రధానవిషయములకు ప్రథమ స్థానము నొసగని విద్యా విధానము మనము పాటింప నర్హము కాజాలదు. ప్రజాసామాన్యమునకు మధ్యగటవు నేప్రయత్నమైనను, అన్నిటికన్న ముఖ్యముగ యథార్థమగు ధనసంబంధమును సాంఘికార్థిక సంబంధమునుగల ప్రమాణములను విచారణలోనికి దీసికొనవలయును.

విభిన్న జీవిత దృక్పథములు :—

మానవుడు సంకీర్ణజీవి; మానవుని పరస్పరసంబంధ మిసుమంతయు లేని గదులు గదులుగ విభజించి, అంతరము లంతరములుగ వికసింప జేయలేము. శారీరక మానసిక ఆధ్యాత్మి

కాంశములను విడిచివేసి వాని మానసికాభివృద్ధిని మాత్రము ప్రోన్నతికి తేజూచు విద్య విపరీత వికార స్వభావుని తయారు చేయుటకే కారణమైనది. మనగమ్యము యథార్థవిద్యయే యైనచో సమస్తశక్తి సామర్థ్యముల గుఱించియు నేకకాల మందే జాగ్రత్త తీసికోవలసి యుండును. కాయకముగను, సాంఘికముగను, మానసికముగను, ఆధ్యాత్మికముగను సమున్ని పరిణతికి దీసికొని రావలసియుండును. అతడొక వృత్తిని నేర్చు కోవలసి యుండును. సమాజమున నొకవ్యక్తిగ జీవించుట నేర్వవలయును. నరులను లౌకిక విషయములను ఎట్టుల నెన్నిక చేసి చూడవలయునో యెఱింగి యుండవలయును. ఈ విషయ ముల నన్నింటిని ప్రవర్ధనమునకు దెచ్చు ప్రయత్నము లోపాన్య మయ్యేనేని, చెప్పుకోదగిన అర్హతగల విద్యమనకు లేనట్లే.

మనపైన మాసిపోవజాలని ముద్రవేయక విడుచు నొక్కపనియైన నుండదు. మనపని, మనఆట, మన వినోదము మనవిశ్రాంతి అన్నియు సాంఘికముగ ఆరోగ్య కరమూ ప్రతి ఫలము నొసగునవిగ నుండగోరుదునేని వానిని విచక్షణా పూర్వకముగ నిర్ణయముచేయ వలసియుండును. పనిచేయు కొఱకగు శిక్షణము పనివాని జీవితమున చాలభాగమును గుఱించి జాగ్రత్త తీసికొనును. మన ఆర్థిక వ్యవహారమునందు మన కాలమున నధికభాగము వ్యయమగుచున్నది. అద్యది మనశక్తి సమర్థతలను పెంపుచేయు నటులను, మనజీవితమును వస్తూత్పత్తిచేయుటలో నైపుణ్యము గలదానిగ నొనర్చు నటు లను ఎంతవఱకు నియమించు కొందుమో; అంతవరకు దాని ఫలములను జాతి శ్రేష్ఠతరమైన దగును. సక్రమముగు పని-

(శ్రమ) జాతిని శుష్కింప జేయక పోవుటేగాక, దానిని సునిర్మితము చేయును. పని యొక్క ధర్మము (Function) మనజీవితాదర్శమును ఆచరణలోనికి తెచ్చునదై యుండవలయును. పూజాపునస్కారములతో ప్రారంభమై వానితోడనే అంతమగు కేవల మతచర్య పైపై మెఱుపే యగును. అనుక్షణము మన ప్రతిచర్యను సంస్కరింపబోదేని ఆ మతము వ్యర్థమే. శ్రమను గుఱించిన అధ్యాయములో మనము గావించిన పృథక్కరణవలన, శ్రమయొక్క ప్రధాన కర్తవ్యము, వ్యక్తి యొక్కయు జాతియొక్కయు అభివృద్ధియేయని గ్రహించితిమి. శ్రమపడుట వయస్కుని యందు సమర్థమగు శక్తినికూర్చునెడల పసివానికి ప్రవర్ధనము చేకూర్చుకొనుటకు దానిని వినియోగము చేయగలముగదా!

మనము మనకార్యోత్సాహము నంతటిని గ్రామముల మీఁద కేంద్రీకరించవలయును. జాతి కేహానియు లేకుండ విశ్వవిద్యాలయాల వ్యాసంగమంతయు కొంతకాలము కట్టిపెట్టనే వచ్చును. ప్రస్తుతము మనకు తలబరువైయున్నది. మన యక్కఱ దీర్చుటకు కావలయునంత మందికంటె హెచ్చుమంది పట్టభద్రులేకలరు. వీరు మనకక్కఱకు వచ్చుతీరు విద్యగఱచి తయారైనవారు కానందున వీరివలన నిరుద్యోగ సమస్య ఒకటి వచ్చి పడినది. అటులకానిచో వీరికి పనికల్పించి వినియోగించుకొనుటలో కష్ట ముండెడిదికాదు. మన గ్రామములోని ప్రజలను హెచ్చుప్రయోజకులనుగను, సమర్థులనుగను చేయుటే మన గమ్యము. వారి తలలో వెలుపలినుండి వచ్చు విషయజ్ఞానమును గ్రుక్కుట మనకు వాంఛనీయము కాదు. రేడి

యోలు, టాకీలు కొంత సహాకారకరములే యైనను, గ్రామీణ విద్యకవి ముఖ్యాధారములు కాజాలవు. వానికొఱకు చేయబడు హెచ్చు వ్యయమునకును వచ్చు ప్రయోజనమునకును పొలికయే లేదు. కావలసినది గ్రామమున అభ్యంతరమునుండి కలుగు పరిణామముగాని, సంఘమునకు బాహ్యమునుండి తెచ్చి నెత్తిని బెట్టు బరువుగాదు. బాహ్యమునుండి వచ్చు దేనికైనను పుష్టి నొసగనలయునన్న కృత్రిమ సాధనము లవసరములగును. అభ్యంతరము నుండి యుద్భవించునది నరుని నరుని, గ్రామమును గ్రామమును తుదకు దేశమునంతటిని చేర్చి ఒక్కటిగ నేకముచేయగల యథార్థమగు సంస్కృతిని పరిఢవిల్ల జేయును.

మనము ప్రకాశమునకు తేనభిలషించు నిర్మాణమునకు అత్యధిక ప్రాధాన్యత నొసగ నక్కఱలేదు. వానిమట్టు కవి ఎంత ప్రధానమైనవిగ గోచరించినను, ఆ నిర్మాణములం దత్యంతము ఆసపెట్టుకొను నప్పుడు, వ్యక్తుల ప్రభావము మఱుగున పడిపోవును; అంతట ఆ నిర్మాణము లధిక వ్యయకారణములై పోయి నిష్ప్రయోజనము లగును. ఇతర క్షేత్రములందువలె విద్యను కేంద్రీకృతము గావించితిమేని, దూరాన నుండు వారి అదుపాజ్ఞలు మితిమీరిపోవును. విద్యయందు కేంద్రీకరణమును ప్రవేశపెట్టుటవలన సంకుచిత విధానములకును ఏకీకృత ప్రమాణములకును (standardization) దారితీయును. ఇది వాస్తవిక విద్యను మారణముచేయును. గ్రామములోని విద్యాగురువు, తోడిప్రజల దృక్పథమును గ్రహించి పనిచేయుట చాల నుత్తమ కార్యము. మఱియు విద్యాప్రచారమున కేర్పడిన సంస్థకు ఈనాములనిచ్చి అందుకగు ఖర్చుల భరించుచుండు ప్రాతపద్ధతిని

ప్రతిగ్రామమునను పునరుద్ధరించు టెంతయు వాంఛనీయ మగును. అటువంటి విధానమున పరిశీలన లాభమును సలహా యును కేంద్రము నుండి దొఱకునేని ఆధిపత్యము స్థానిక ప్రజల భావమున కనుసరణముగనే నడుచునుగాన, సర్వవిధముల నది విశేషోపయోగకరముగ నుండగలదు. ఇప్పు డన్ననో ఉపాధ్యా యుడు సంవత్సరమున కెప్పుడో యొకసారి వచ్చు పరీక్షాధికారిని మాత్రము తృప్తిపఱచవలసిన వాడుగాన ఆ పరీక్షానంతరము శ్రద్ధ విడనాడగల్గుచున్నాడు. దీనివలన నిరంతరాభివృద్ధి పొస గదు; సుస్థిర కార్యసిద్ధియు కలుగదు. ప్రతిగ్రామము నందును పాఠశాల యనునది సంస్కృతికి మూలకందమై యొప్పారు, బాహ్యప్రపంచ సంసర్గకు మూలబిందువై పఱగుచుండవలెను. ఈ పద్ధతియందు నొక లోపము ఘటిల్లవచ్చును. ఉపాధ్యా యుడు గ్రామములోని సాపూజిక భావమును పెంపొందించుటే తన కర్తవ్య ధర్మమని తలపోయుట కలవాటుపడి, బాలప్రా యుల యెడ తన విధాయక ధర్మమును ప్రధానముగ గుర్తిం చక ఉపేక్షించ నగును. ఈ సామాజిక దృష్టి యనునది (social spirit) పాఠశాలా నిర్వహణమున ఆనుషంగిక విషయ మగునుగాని అదియే పరమావధి కాదు; మనము మానవ స్వభా వమును నమ్ముకొని ఆత్మవిశ్వాసముపూని, మన పరమావధిని సదా దృష్టిలో నిడుకొని సాగిపోవుచుండగ వలయును. స్వల్పాం శములందు వ్యత్యాసములున్న నుండుగాక; ఐనను యథార్థమా సంస్కృతిని ఆధారభూతముగా ప్రమాణములను ప్రవర్తనము గావించుకొంటిమా మన పరమ లక్ష్యమును చేరగల్గుదుము; మఱియు పైకి కాన్పించు భిన్నత్వ మున్నను ఐక్యతను సాధింప గల్గుదుము.

ప్రతిపాదితప్రణాళిక (supposed system)

మన విద్యాప్రణాళిక యేమార్గము ననుసరింపవలసి యుండునను విషయమును గూర్చి చాల చర్చలు జరుగుచున్నవి. విద్యావ్యాపకము స్వయంపోషకముగ నుండవలయునని గాంధీజీ సూచించియున్నారు. ఆయన యిట్లు వ్రాసియున్నారు. "పసివానియొక్కయు పెద్దవానియొక్కయు శరీరమనశ్శక్తులందు గల యుత్తమ ప్రభావమును సర్వాంకషముగ (all-round) ప్రకాశమునకు దెచ్చుటే విద్యయని నా యభిప్రాయము. విద్య కది తుదిగాని మొదలుగాని కాదు. అది అక్షరజ్ఞానము స్త్రీ పురుషులు విద్య గఱచుటకగు ఉపాయములలో నొకటి మాత్రమే. కేవలము అక్షరజ్ఞానమే విద్యయనదగదు. కావున శిక్షణ గఱపుట కారంభించు క్షణమునుండియు, ఉత్పత్తిచేయు శక్తి నొసగు నుపయోగకరమగు ఒక హస్తపరిశ్రమము నేర్పుటతో బిడ్డ యొక్క విద్యాభ్యాసమును ప్రారంభముచేయ గోరెదను. ఆ విధముగ ప్రతిపాఠశాలను స్వయంపోషకము చేయనగును. ఈ పాఠశాలలందుత్పత్తియగు సరకులను ప్రభుత్వము తీసికొనవలయు ననెడు నియమము మాత్రముండ వలయును.

"అటువంటి విద్యాపద్ధతి ననుసరించిన యెడల మనస్సు యొక్కయు ఆత్మయొక్కయు అత్యున్నత పరిణామము సాధ్యమగునని నాదృఢ నిశ్చయము. కాని యే చేతిపనియైనను, ఈ నాడు జరుగునటుల, నిర్జీవయాంత్రిక చర్యగ మాత్రము నేర్పదగదు; శాస్త్ర సమ్మతముగ నేర్పవలయును; అనగ బిడ్డకు తాతడుచేయు ప్రతికర్మయు నెందులకో ఎట్టి ఫలితార్థము నొసగునో తెలుప వలయును. కొంత ఆత్మవిశ్వాసము లేకుండనే

సిట్లు వ్రాయుటలేదు సుడీ! స్వానుభవము యొక్క ప్రోద్బలము తోడనే వ్రాయుచున్నాను. ప్రచారకులకు వడుకుట నేర్పబడు సందర్భములందెల్ల ఈ పద్ధతి దాదాపు పూర్తిగ ప్రయోగము చేయబడుచునే యున్నది. ఈ పద్ధతితో పాదర్శ్యలు చేయుటను వడుకుటను సయితము నేను నేర్పియుంటిని. సత్ఫలములే లభించినవి. ఈ విధానమునందు, చరిత్ర భూగోళశాస్త్రములకును తావులేకపోదు. అయినను అటువంటి సామాన్య జ్ఞానమును సంభాషణద్వారమున తెలుపుట వలన మిక్కిలి చక్కగ నేర్ప వచ్చునని నేను కనుగొంటిని. వ్రాయుట చదువుట మూలాన ఎంత నేర్పగల్గుదుమో దానికి పదిరెట్లుగ పైవిధమున నేర్ప వచ్చును. కాలక్రమమున బిడ్డకు అభిరుచి కొంత పక్వమైన పిమ్మట అక్షరమాల చిహ్నములను నేర్పవచ్చును. ఇది విప్లవకరమైన ప్రతిపాదనే కావచ్చును. కాని చాల శ్రమ దీనివలన కలిసి వచ్చును. ఈ పద్ధతి ననుసరించు విద్యార్థి యితరత్రా సంపాదించుటకు చాల హెచ్చు కాలము పట్టునంత జ్ఞానమును ఒక్క సంవత్సరములో సంపాదింప గల్గును. అనగ నిది సర్వాంకషమగా పొదుపుఅనియే అర్థము. విద్యార్థితాను చేతిపనిని నేర్చుచుండు కాలముననే గణితమును నేర్వగలడని వేఱుగ చెప్పవలయునా?

"నేను ప్రారంభ విద్యకు అత్యంత ప్రాధాన్యత నొసగెదను. నా యభిప్రాయములో ప్రారంభవిద్య యనగ ఇంగ్లీషు భాష మినహా, యిప్పటి మెట్రిక్యులేషనుకు సమానమగా విద్యయే. కళాశాలలో ప్రవేశించి పట్టభద్రులైనవారు హఠాత్తుగ తమ విజ్ఞానమునంతను మఱచిపోదు రనుకొనుడు. అట్టి

మాతాద్విస్మృతి వలన గలుగు నష్టము, ముప్పదికోట్లమంది అజ్ఞానసాగరమున ముంచి యుంచుటవలన మూడునట్టి నష్టముతో పోల్చి చూచు నెడల లేనేలేదనియే చెప్పనగును. కోట్లాదిగగల గ్రామవాసులయొక్క అజ్ఞానరాశిని అతుగ జ్ఞానాభానముతో కొలతవేసి యింతయని నిర్ణయించుట శక్యము కాదు."

ప్రారంభ దశలలో బాలబాలికల విద్యాస్వయంపోషక మెన్నడును కాజాలదు. వార లుత్పత్తిచేయు వస్తువులునుండు వినిమయమునకు దగిన విలువగల వస్తువులు కాజాలవు. ప్రభుత్వము వానిని దీసికొను నెడలను నష్టమును భరించుటకది యొక యుపాయము మాత్రమేయగును. ప్రప్రథమ దశయందు విద్య స్వయంపోషక మంటిమా, మనను మనమే మోసగించుకొనిన వారమగుదుము. గాంధీజీ స్వయంపోషకమగు నని నప్పుడు వారి యర్థమేమన, ప్రతిసంవత్సరము బిడ్డ తయారుచేయు వస్తువులతో ఆసంవత్సరము బిడ్డ యీదగిన ప్రతిఫలమంతయు పూర్తిగ లభించు ననికాదు; అది బహు సంకుచితమగు ఆర్థిక దృక్పథము. అదెన్నడును శాస్త్రనముకాదు. గాంధీజీ చెప్పుదాని భావము కడువిశాలతరమైనది. విలువలు తేల్చుట డబ్బురూపమున కాకూడదు. ఆబిడ్డడు భావికాలమున సుశిక్షితుడైన పౌరుడుగ అర్పింపగల సేవల దృష్ట్యా విలువను తేల్చవలసి యుండును. ప్రస్తుతమన్ననో, గ్రామములో బిడ్డలకు నేర్పబడుచున్న చదువుట వ్రాయుట గణితము వేయుట యను వానిలోని అభ్యాసము చాల నిస్సారమైనది. కొలది సంవత్సరముల యనంతరము అది విద్యాశూన్యదశగనే మారిపోగలదు.

అట్టి బిడ్డల కొఱకై వ్యయము చేయబడు డబ్బు, కాల క్రమమున దండుగయే యనిపించుకొనును. కాని ఆడబ్బును, సార్థకమగు మార్గమున వ్యయపఱచిన యెడల ఆపిల్లలయొక్క తరగతి యుత్పత్తి చేసిన సరకు ఏసంవత్సరముకా సంవత్సరము ఖర్చులకు సరిపోక పోయినను, ఏడు సంవత్సరముల విద్యాలయ శిక్షణానంతరము, ఆ తరగతిలోని వా రుత్పత్తి చేసిన మొత్తపు సరకు వలనవారి ఉపాధ్యాయునికై ఖర్చుచేసిన మొత్తమును ప్రతిఫలముగ రాబట్టు కొనుటకు తప్పకసరి పోవును. మొదటి రెండు సంవత్సరములందును నష్టమేనచ్చును; తరువాత మూడు సంవత్సరములలోను ఖర్చులు మాత్రము పూడును; తుదిరెండు సంవత్సరములలోను ఆ బిడ్డలు సక్రమముగ శిక్షణము గఱపబడియున్న యెడల మొదటి రెండు సంవత్సరముల నష్టమును కూడ పూడ్చుటకు సరిపోవునంత లాభము వచ్చితీరవలయును. ఇంతేగాక యిదివఱకే తెలుపబడిన రీతిని, ఒక సత్పౌరుని శిక్షణము, ప్రభుత్వముచే ధనరూపమున వానికై చేయబడిన వ్యయమునకుసరిపోవు ప్రతిఫలముకన్న హెచ్చులాభము నే సమకూర్చ గలదు. స్థానికముగ అవసరమగు నూలును వడుకుట, రంగులు వేయుట, నేత నేయుట, కుట్టుకుట్టుట, చాపలు బుట్టలు అల్లుట, లోహకారవృత్తిచేయుట, కాగితముచేయుట, బెల్లము తయారు చేయుట, నూనెగానుగాడుట, తేనెటీగల పెంచుట మొదలగు వృత్తులను బిడ్డలకు నేర్పునెడల సరకును విక్రయముచేయుట యనెడు సమస్య గొప్పది కాదు. సామాన్యముగ శిల్పికడ విద్యనేర్చు పిల్లవాడు సయితము ప్రప్రథమము నుండియు వానికగు వ్యయమునకు సరిపోవు సంపాదనను చేసిపెట్టజాలడు. వాని

శిక్షణము వలన కొంతకాలము నష్టమే వచ్చితీరును. ప్రారంభ దశలను గడచిన పిమ్మట నతడు లాభదాయకముగ దాని నేదేని తయారు చేయగల్గును. ఆ యుపసంహారము తన శిక్షణ వ్యయము సరిపుచ్చగలడు. ప్రారంభశిక్షణావ్యయమును భరించు టకు ప్రభుత్వము నిధుల నేర్పాటుచేయవలయును; లేదా అందు కొఱకని ప్రజలు కొంత భూమిపైని ఆదాయము ప్రత్యేకించి తీరవలయును. శిస్తుల వసూలుచేయు బ్రిటిషు పద్ధతి వచ్చినపుడు గ్రామపాఠశాలలను భగ్నము చేయుటకు ప్రారంభము అట్టు లనే జరుగుచుండెడిది. కాని చిన్నవయస్కుల విద్యాభ్యాసము ప్రభుత్వవిధులలో నొకటిగ నుండితీరవలయును. నాడు ప్రస్తుత పరిస్థితులలో నీ సమస్య రాజకీయముగ కల్పితమైన ధనసమస్య యైపోయినదిగాని సహజమైనది కాదు. దీని పరిష్కారము రాజకీయముగ దానిని సరిదిద్దుటచే సాధింపనలయును. కాని దానిని అనివార్యసంఘటనగ నెంచుటవలన పోనగునది కాదు. ఉపాధ్యాయుడు సుశిక్షితుడైన వ్యక్తిగనుండి ప్రథమమునసే సరి పోవునట్లుగ నెలకు 25 రూపాయల జీతమును పడయనలయును. పాఠశాల నడుచుకాలము, బోధనాసమయములు గ్రామ పంచాంగమున కనుసరణముగ నుండవలయును. కోతల సమ యమున గాని లేక పొలములలో హెచ్చుగ పనిపాటలు సాగు కాలమున గాని తరగతులు జరపదగదు.

ప్రణాళికయొక్క సామాన్య స్వరూప సూచన:—

వార్ధావిధానము లేక ప్రస్తుతము పేర్కొనబడుచున్న ఆధార ప్రణాళిక బాల బాలికలకు ఏడవయేట మొదలు పదు నాల్గవయేడు వఱకు ఏడేండ్లు నిర్బంధమగు ఆధార విద్యను

నియమించు చున్నది. బోధనాసాధనగ నూలు వడకుటవంటి వృత్తియై యుండ దానిచుట్టును చేర్చికూర్చి అన్ని బోధ్యాంశములను నేర్పవలయును. విద్యార్థియొక్క అనుదిన జీవితమును తదనుబంధముగ కూర్చబడిన వృత్తియు, వానియొక్క భౌతిక సాంఘిక పరిస్థితులును అతడు నేర్చు విజ్ఞానాంశములన్నిటి నడుమను పరస్పరానుబంధ ధర్మమును కూర్చగల్గును. ఇంగ్లీషు మినహా యిప్పటి మెట్రిక్యులేషను విద్యాపరిమితి మన లక్ష్యముగ నుండును. విద్యార్థి చిత్రలేఖనమును నేర్చువఱకును వ్రాతను నేర్ప యత్నము చేయదగదు. చూచి చదువుటను ముందు నేర్పవలయును. పండ్రెండవ సంవత్సరముల యీడు వచ్చిన యనంతరము జీవనాధారముగ నేదేని ప్రత్యేకవృత్తిని విద్యార్థి నిర్ణయించుకొనవచ్చును. పదునాల్గువత్సరముల వయస్సు వచ్చునప్పటికే వానిని కర్మకుశలునిగ జేసివేయుట మన వాంఛితార్థము కాదు; కాని విద్యార్థి యేదేని జీవనవృత్తిలో ప్రవేశించి అందు తన నేర్పునకు సాఫల్యముం గూర్చుకొనుటకు అనుకూలించు శిక్షణము నతడు పడసియుండవలయును.

ఈ ప్రణాళికయందు ప్రధానాశయము 'వృత్తిశిక్షణ' ద్వారమున బుద్ధి వికాసమును సాధింపవలయుననుటే. ప్రస్తుతమున్న విధానములో సాహిత్యవిద్య ప్రముఖస్థాన మాక్రమింపగ దానిపై వృత్తిశిక్షణ మాధారపడుచున్నది. కాబట్టి బుద్ధికి శిక్షణ మిచ్చుట మొట్టమొదటి స్థానము ఆక్రమించును గాన మన మొక విధముగ విద్యార్థి కాలుసేతులను కట్టివేసిన ట్లగుచున్నది. అతడు ఆచరణయోగ్యత లేనివాడగుచున్నాడు. ఇట్లు బాల్యమున చచ్చుపడిపోయిన వాని యంగములు, అభివ్యక్తిం

నెంతగ శిక్షణ నొసగినను తేరుకొనజాలవు. ఆధారముగ నుండ దగిన అనుభవమును శూన్యముచేసి నొసగబడిన బోధ కేవలము బుద్ధిస్మృతి కొసగు శిక్షణ మాత్రమగును. దానివలన కల్పనాచాతుర్యముగాని, వ్యక్తి ప్రభావ వికాసముగాని ప్రదర్శనము కాజాలవు.

పరీక్షలు:—

ఈ ప్రణాళిక ననుసరించి పరీక్షల రాకడి ఉపాధ్యాయ వర్గమునకు తగుటనుగాని విద్యార్థులకు తగులదు. విద్యార్థి జీవితమున, దినములో నిరువదినాలుగు గంటలును గురువు యొక్క అదుపులో గడచునుగాన ఆ గురువు ప్రతి విద్యార్థి యొక్క గృహముతోడను, అట్లే గ్రామముతోడను గాఢముగ సమైక్యత చెందినదై యుండును. ఆ గురువుయొక్క పని గ్రామముయొక్కయు అందలి గృహములయొక్కయు స్థితిగతులలో ప్రతిఫలనము చెందుచుండును.

స్త్రీల వంతు:—

మనము బిడ్డయొక్క సహజమగు కాయక వికాసమును అనుగమింపవలసి యుండును; మఱియు మానసికముగను నైతికముగను ఇంకను ఆధ్యాత్మికముగను వికాస మనుగమింపవలసినదే. రూపము రంగు చలనములను గాంచి బిడ్డ మక్కువపడును. ఆపిమ్మట ఆ వస్తువులట్లుండుటకు కారణమును తెలిసికొన ప్రయత్నించును. అటుపిమ్మట నతడు తాను కోరిన తీరున వానిని మార్చుటకు వీలగునాయని ప్రయోగము చేయసాగును. ఈరీతిగ నతడు వినోదముతో ప్రారంభించి పరిశోధనకును అందుండి కల్పనకును పురోగమించును. ప్రతి బిడ్డయం

దును గల శ్రేష్ఠతర ప్రతిభను వెలికిదీయుటకై మనము ప్రయత్నింతుమేని, ఈ మూడు దశాంతరములను ప్రోత్సహించు విద్యాపద్ధతిని అవలంబింపవలసియుందుము. అందుకుగాను ఉపాధ్యాయుడు బాలభావము లోనికి జొఱబడి, దానిని పంచుకొనుటకు పూర్తియైన అర్హతగలవాడుగ నుండవలయును. నైజప్రవృత్తివలనను, సహజనైపుణ్యమును బట్టియు స్త్రీలు ప్రథమదశాంతరమున బిడ్డల నర్థము చేసికొనుటలో హెచ్చుసమర్థతగలిగియుందురని సామాన్యముగ నచింపవచ్చును. భారతదేశములో స్త్రీజనమందు విద్య లోపించి యుండుటవలన విద్యావిధానమున అమితమగు లోటు గాన్పించుచున్నది. తల్లులు బిడ్డలకు శిక్షణ గఱప నర్హులు కాకున్నారు; బడులలో నుపాధ్యాయినులుగ చేయుటకు అర్హమగు విద్య గఱచిన స్త్రీలు దొరకుటలేదు. మనము పాఠశాలల సంస్కరింప బూనుదుమేని రాబోవు తరమువారికి సహజ సంరక్షకులుగ నేర్పడబోవు బాలికలయు యువతీ జనము యొక్కయు విద్య ప్రప్రథమ కర్తవ్యమని నాయభిప్రాయము. మన మక్కడ ప్రారంభముచేసిన తప్ప, కేవలము పురుషుడు ఎన్ని యెత్తుగడలను పన్నినను, ఎన్ని ప్రణాళికలు రచించినను, అతడు బిడ్డయొక్క భావగ్రహణ నయము గడచిపోయిన పిమ్మట కార్యక్షేత్రమున ప్రవేశించవలసినవాడుగాపున, ఆపన్నుగడలు వ్యర్థములగుచున్నవి. బిడ్డలకేడేమిదేండ్లు రాకపూర్వము వారిని సాకు గ్రామపాఠశాలలన్నియు స్త్రీల చేతులలో నుండవలయును. చాలవయదుగతప్ప, అలాటి పాఠశాలలలో పురుషులను ఉపాధ్యాయులనుగా నియమింపదగదని చెప్పదగును. వికాసమున బిడ్డల రెండవ దశాంతరమునందు

విద్యార్థుల యోచనాశక్తిని వృద్ధిగొలుపగలవాయెను, సంఘటనలకు కార్యకారణముల వివరించి చెప్పగలవాయెను కావలసి యుండును. లేబర్నమూనియను సమాఖ్యచేత సిర్యాకూసు నగరమున నిర్వహింపబడుచుండిన యొక పాఠశాలను సందర్శించు నవకాశము నాకు చిక్కినది. ఆపాఠశాలలోని వారందఱు నొకే సంఘముగ జీవించుచుండిరి. విద్యార్థులు ఆహారవస్తువులు తయారు చేయుటలోను, ఇతర గృహకృత్యము లన్నింటిలోను పాల్గొనుచుండిరి. దానికొక క్షీరశాలగలదు. ఉపాధ్యాయులలో నొకరు దానికి యజమానిగ నుండిరి. కొందఱు బాలురు వానికి సాయము చేయుచుండిరి. సుమారు పదునొకండేండ్ల ప్రాయముగల విద్యార్థులకు "అర్థశాస్త్ర" బోధ జరుగు తరగతికి పోయియుంటిని. ఆనాటి విషయము "ఆవునుకొనుట". సుమారు పదేండ్ల వయసుగల బాలు డొకడా తరగతికి యాజమాన్యత వహించినాడు. ఉపాధ్యాయుడు వెనుక వరుసలో నాతోగూడ కూర్చుండెను. యాజమాన్యత వహించిన బాలుడు (హారిసని పేర్కొందము) ఒక ఆవును కొనుటకై పొరుగున జరిగిన సంతకు క్షీరశాలాధ్యక్షుడగు ఉపాధ్యాయునితో గూడి వెళ్ళియున్నప్పుడు తనకు గలిగిన అనుభవమును తరగతివారికి వివరించి తెలిపినాడు. ఉపాధ్యాయుని మనము పాపారా వని పేర్కొందము. ఆ తరగతిలో నీక్రింది ప్రసంగము సాగినది:— అధ్యక్షుడుగ నున్న బాలుడు "మన మందఱకును చాలినన్ని పాలు మన గోవుల వలన దొరకుట లేదు. కావున పాపారావు గారితోగూడి ఒక ఆవును కొనుటకై నేను "వేలముపాట" దుకాణము దాపునకు పోతిని" అనెను. అంతట విద్యార్థులలో

నొకడు 'వేలముపాట దుకాణమేమిట'ని ప్రశ్నించినాడు. "వేలముపాట దుకాణము అనగ స్థిరమైన వెలలులేకుండ అమ్మకములు చేయు అంగడి. అంగడి వ్యాపారి ఒక వస్తువును బయటికి దీయును. దానిని కొనవచ్చినవారు పోటీలుపడి దానికై తామీయనెంచు ధరలను ఒక్కొకరుగ తెలుపుచుపోదురు. ఇది వేలముపాట. వారందఱిలో హెచ్చు పాటపాడినవానికి దుకాణదారు డావస్తువును ఇచ్చును" అని మొదటివాడు వివరించినాడు. తరువాత వేలముపాట సరణి విశదముచేయబడినది. అప్పు డింకొక విద్యార్థిలేచి "కొనుగోలు దారులు వేర్వేఱు ధరలు పెట్టు టెందుకు?" అని శంకించెను. హరి యిట్లు సమాధానము చెప్పినాడు: "మనము కొన్న ఆవునకు 75 డాలర్లతో ప్రారంభమైనది. తుదకు పాపారావుగారు 120 డాలర్లు పాడగ ఆధరకు కొట్టివేయబడినది." కొట్టివేయుటను నేనెూ వివరించుచు "మొదటి బేరగాడు 75 డాలర్లు ధరపెట్టగ, అటకు వచ్చిన యితరులు ధరను పెంచుచు పోయిరి. పాపారావుగారు 120 డాలర్లు ధరపెట్టిన పిమ్మట నెవరును పైపాట పెట్ట లేదు. కాబట్టి ఆవును ఆధరకు కొట్టివేసినాడు; అనగ ఆధరకు అమ్మివేసినాడు. వేఱొక పిల్లవాడు "120 డాలర్లకు పైన హెచ్చు ధర నెందుకు పెట్టలేదు?" అన్నాడు. హరి యిట్లు విశదపఱచినాడు: "వేలముపాటకు పూర్వము కొనదలచినవా రందఱును ఆ ఆవు చరిత్ర సంతతిని విచారించినారు. అది సంవత్సరమున కెన్ని పాలిచ్చునో, దాని మేతకై సంవత్సరమున కెంత ఖర్చగునో యితరములగు ఖర్చు లెంత యగునో లెక్కవేసి, దానికై తామిచ్చు ధర ఎంతయైనచో ఆ ఆవిచ్చు పాలవలన దానిని

రాబట్టు కొందగునో తెల్పుచున్నారు. ఇట్లు దానికొఱకు కీయదగు గరిష్ఠధరను నిర్ణయించు కొనిన పిమ్మట, దానిని కొనగోరువారు ఆ ధరను మించి పాటబెట్టరు. ఆగంట యంతయు నిట్లు గడచినది. తరగతి బాలురు ఆయా విషయములం గూర్చి యోచనలను సాగించిరి. గొప్ప ఆర్థిక శాస్త్ర వేత్తలగు 'యాడముస్మిత్తు' మొదలు 'మార్షలు' వఱకుంగల పెద్దలు వ్రాసిన ఆర్థిక సిద్ధాంతముల నన్నింటిని పఠించి పారాయణము చేయునప్పటి కంటె ఈ బాలుర చర్య యెన్నియో రెట్లధికముగ వారి మేధాశక్తికి ప్రభోధము గల్పించినది. సిద్ధాంతముల చర్య మన స్వానుభవముపై నాధారపడు నెడల బహుసరళిముగ స్వీయకల్పనా రచన చేయగల పైపై దశాంతరములకు దారి జూపును.

ప్రస్తుతము మన మనుసరించు విధానము వలన స్వీయముగ ఊహాకల్పనల సాగింపగల్గు వారు లభించుట లేదు. మన విశ్వ విద్యాలయాల నుండి పట్టభద్రులైన వారు సహా యీ మూడవ దశాంతరమునకు చేరిన వారు కారు. ఈ లోపము వలననే మనము ఎదుగు బొదుగులేని వారముగ నున్నారము. మన కీయబడుచు వచ్చిన బోధ మనను గుమాస్తాలనుగ మాత్రము చేయుట కుద్దేశింపబడినదనియు, స్వయంకల్పన చేయ గలబుద్ధి గుమాస్తాల కనసరమగు లక్ష్యము కాదనియు తెలిసి కొనియే యుంటిమి. ఈ దశాంతరమునకో కొంత స్వావలంబన శక్తియు, ఆత్మ విశ్వాస భలమును కావలసి యున్నది. [illegible]యుడు చేయదగిన దేమన, ప్రక్కన నిలుచుండి కని [illegible] సలహా లొసంగు చుండుటే.

లలిత కళతో సంబంధము కొంతయైనను లేనియే వృత్తి శిక్షణము గాని విద్యగాని సంపూర్ణము కాజాలదు. మన విద్య యందలి యీ యంశమును గూర్చి ఠాకూరు మహాకవి మిగుల శ్రద్ధతీసికొని యున్నాడు. సామాన్య జనుల పాటలు, సంగీతము చిత్రకళ యనునవి ప్రతి గ్రామపాఠశాలకును ప్రధానాంగము లుగ నంగీకరింపవలయును. అటువంటి పాఠశాలలు ఏదేని వృత్తి విద్య ఆధారముగాను, లలితకళ సహకారిగాను ప్రచారము లోనికి వచ్చు నెడల, అందలి బోధ్యాంశము లెంత నిరాడంబర మైన వైనను, ప్రవర్తనము ఆత్మ విశ్వాసము గల స్త్రీ పురు షులు తయారగుట సిద్ధించును. వారప్పుడు పట్టు పరుపులపై శయనించు భోగముల కాశపడి పరదేశీయుల పాదాలచుట్టు తిరుగులాడ నొల్లరు; వీరు సగర్వముగ తలనెత్తుకొని తిరు గుచు స్వతంత్రులై మెలగుదురు. ప్రజాసామాన్యముతో కలిసి మెలిసి జీవింపుచు వారి దీనదశను పంచుకొన సంసిద్ధులుగ నుందురు. ప్రజాసామాన్యము యొక్క సంస్కృతి సుదృఢ మును విశాలము నగు పునాది గాగల్గిన యున్నత జాతిని నిర్మా ణము చేయుటకై మనయావచ్ఛక్తిని వినియోగ పఱచని యెడల పైపై నిర్మాణముల కూర్చుమన యత్నము లన్నియు వ్యర్థము లేయగును. తన స్వీయసంస్కృతిలో వేరూని వర్ధిలని యేజాతియు ప్రపంచ జాతుల పురోగమనములో తనస్థానము నాక్రమించి నడువ జాలదు. ఎఱువు దెచ్చుకొని సింగారించు కొనిన యీకలతో ప్రకాశింప గల్గుటకల్ల. గాన కాళా సాహిత్య ప్రపంచమునకు, మన వంతు అగు ప్రతిభను తప్పక ప్రసాదింపవలసి యున్నాము.

గాంధీజీ ప్రవచించినటుల సర్వకళాశాలవిద్యయు స్వయం పోషకము కావలసి యున్నది. ఒక వ్యవసాయక కళాశాల దానికొసగబడు క్షేత్రము మీదనాధారపడి ఆత్మపోషణ చేసి కొజాలనిచో దాని ఆశయమును వ్యర్థ పుచ్చినట్లగును. అటు లనే వృత్తివిద్యాలయములను సాంకేతిక కళాశాలలును తమను తాము పోషించుకొను నటుల చేయవలసి యుండును.

## సామాజిక జీవితము

ఇంతవఱకును ప్రధానముగ వ్యక్తియొక్క ప్రతి దిన ఆర్థిక జీవనమునకు సంబంధించి వాని జీవనసరళిని పరామర్శించి యున్నాము. ఈ అధ్యాయములో సమిష్టిజీవనమున స్థానము సమాజ సభ్యునిగ నరుని చరితను విమర్శింతము. నరజీవనమును ప్రకృతిలో నొక యంశముగ నిరూపించి ప్రస్తావించుచుంటిమి. అటుల చూచునెడల విశ్వజీవితమున మానవుని జీవితము క్షణ భంగురమగు నొకానొక యంశమే యగును. ఈదృక్పథము నుండి మనయనుదిన జీవనమును పరామర్శించ వలసియున్నది.

మానవజీవితమును ప్రత్యేకముగ దాని కదియే పరమా వధిగ విమర్శింతుమేని వ్యక్తినరుని జీవితము స్వల్పకాల దృష్టే క్షేత్రమున బడవేసి నట్లగును. కాని దానిని ఇతరుల జీవితములతో గుదిగ్రుచ్చితిమేని, దానికి కొన్ని హద్దు లేర్పడును. మనుజుడు తన యిచ్ఛానుసారము వర్తింపజాలడు. ఇతరుల యోగక్షేమ ముల విచారణతో వాని చర్యలకు హద్దు లేర్పడుచున్నవి. అప్పుడు ప్రతి వ్యక్తియొక్క యలవాట్లు, ఆరోగ్యము, నివా

సము అనునవి పరిసరము లందుండు పరిస్థితులతో సంబంధము గల వగును.

ఈ విషయమును దృష్టిలో నుంచుకొని, సంఘములుగ గూడిన ప్రజ లెటుల జీవించవలయునో తెలుపు సామాన్యమగు నియమములను గమనింపవలసి యుండును. భారతదేశములోని నర నివాసములు చాలవఱకు గ్రామములుగ నేర్పడిన యిండ్లయు, గుడిసెలయు గూడెములయు సమూహములుగ నున్నవి. కాబట్టి గ్రామ జీవనమును సమష్టి క్షేమము యొక్క యీ దృక్పథమునుండి పరామర్శించవలసి యుందుము.

ఒక ఉదాహరణను జూతము:- నరుడు తన శరీరము నందు అరిగిపోయినదానిని పూరించుటకును సత్తువను సంపాదించుకొనుటకును రోగములు రాకుండ రక్షించుకొనుట కనువగు చైతన్యశక్తిని కూర్చుకొనుటకును, ఆహారమును తినుచున్నాడు. ఆ ఆహారమునుండి శరీరము తనకు వలయుదానిని దీసికొని జీర్ణము గానిదానిని ప్రకృతికి తిరిగి యిచ్చివేయుచున్నది. అటుల విసర్జనముచేసిన పదార్థమును, ప్రకృతి తనలోనికి జీర్ణముచేసికొనగలుగు విధముగను తిరిగి యిచ్చివేయవలసి యుండును. ఈ విచారణాంశములందు ప్రతిదానిలోను రెండంశము లిమిడి యున్నవి. వాని నీ క్రింద వివరింతము.

ఈ అధ్యాయములో పారిశుద్ధ్యము, ఆరోగ్యము, నివాస సందర్భమున గమనించవలసియుండు వివిధాంశముల విచారణను కొలది కొలదిగ చేయుదము. మన మిదివఱకే విచారించియున్న ఆర్థికదృష్టితో గాక, సామాజిక రాజకీయదృష్టితో ధారాళముగ పనిచేయు నొక సుసంఘటిత ప్రాథమిక సంస్థను రూపొందించు

టలో సహకరింపవలసిన గ్రామవాసుల పరస్పర సంబంధమును గురించి విచారింప గడంగుదము. ఈ గ్రామము లనెడు ప్రాథమిక సంస్థలు స్వయంపరిపాలనా సమర్థమగు జాతికి అంగములై వెలయగలవు. స్వారాజ్యము, ప్రజాపరిపాలనమునకు సంబంధించిన బాధ్యతలను తలదాల్ప వలయు. గ్రామ ప్రజలను సమర్థుల చేయుట కివి శిక్షణాక్షేత్రములై యొప్పును. కాబట్టియే యిట్టి గ్రామ నిర్మాణములం గూర్చిన విచారణ కింత ప్రాధాన్యత నిచ్చుట అవసరమైనది.

గ్రామసంస్థ చక్కగ నిర్మాణమైనప్పుడు, అది స్వీయ సంస్కృతిని పరిణామమునకు దెచ్చును. వ్యక్తిప్రభావము వ్యష్టి కెటువంటిదో, ఈ సమష్టి సంస్కృతి సమూహమున కటువంటి విశిష్టలక్షణమై పఱగును. ఈ గ్రామ ప్రజాజీవన విశిష్ట లక్షణములు మనకు శాశ్వతత్వమునకు చేరువకు దెచ్చును. మనుష్య జీవితకాలము డెబ్బదేండ్లని గణితము వేయు టెంత యో గొప్పయే; కాని గ్రామ సంస్కృతిపై నాధారపడి వర్ధిలు ఈ ప్రాథమిక సంస్థలు చిరకాలము మన గల్గును. మనము పరిణతికి దెచ్చు సంస్కృతియొక్క ప్రభావము మానవ స్వభావము పైననే ఆధారపడి యుండదు; ఈ గ్రంథ సంపుటములో నెల్లెడలను మనము పూనిన దృక్పథముపైనను ఆధారపడి యుండును. మన దైనందిన జీవితములందు సత్యాహింసాధర్మ సూత్రముల నాచరణలో బెట్టువిధ మాధారముగ మన మీ సమస్యను విచారింపబూని యుంటిమి. ఈ పనిని మనము జాగరూకతతో చేపట్టి ప్రతి స్వల్పాంశమును గూర్చియు శ్రద్ధవహించితిమేని,

పై సిద్ధాంతములు పునాదిగ వెలయు సమాజము మనకు సిద్ధించగలదు.

పారిశుద్ధ్యము:—

వ్యష్టి యొక్క శౌచవిధులు:—పరంపరాగతముగను తమ అలవాటునుబట్టియు వచ్చిన వ్యష్టిశౌచ విధులందు పట్టుదల గ్రామవాసులలో సామాన్యముగ హెచ్చు. దురదృష్టవశమున నవనాగరిక వ్యామోహమువలన ఈ సదాచారములు విసర్జించు చుండిరి. కాబట్టి శౌచముం గూర్చిన ప్రాచీన సదాచారములను పునఃపట్టుదలతో నవలబింపజేసి, అవసరమగుపట్ల క్రొత్త సదాచారములను గూడ వానికి చేర్పవలయును.

సమష్టి పారిశుద్ధ్యము:— మన గ్రామ జీవితమున నిది బహు శోచనీయాంశముగ నున్నది. గ్రామముల బాటలు, రోడ్లు బహిరంగ స్థలములు చెఱువుగట్లు అన్నియు పెంటలతో పాకీదొడ్లగుచున్నవి. ఎల్లెడల గ్రామ వాసులు అనాలోచితముగ మూత్రపురీషముల విడుచుచు అన్ని ప్రదేశములను ప్రజలు తిరుగాడు స్థలములను గూడ మలినము చేసివేయుచున్నారు. మంచినీళ్లు తెచ్చుకొను తావులను సయితము అసహ్య స్థలములుగను ముఱికి తావులుగను చేయుచున్నారు. కాని యీ దోషము పూర్తిగ గ్రామవాసులదన లేము. గ్రామములలో సరిగ నిర్మింపబడిన మూత్రపురీషములు విడుచుట కనువగు మఱుగుదొడ్లులేవు. ఇండ్లలో జనసమ్మర్దము హెచ్చు. అవెంతయు చిన్నవి. ప్రతి యింటికిని తగిన సదుపాయములు అమరగల సావకాశము లే లేవు. కాబట్టి సహకారపద్ధతిని మఱుగుదొడ్లను, స్నానఘట్టములను నిర్మించి సుస్థి

తిలో నుంచుట ముఖ్యావసర విషయముగ నున్నది. మలమూత్ర పురీషాదులను చెత్తచెదారములను మార్చి మంచి యెరువుల నుగ సిద్ధముచేయుటయు అత్యవసరము. పారిశుద్ధ్య దృష్టి తోడను ఆర్థిక దృష్టితోడను గ్రామముల కనుకూలములగు ప్రణాళికలు ముఖ్యముగ నవసరమై యున్నవి. సమష్టి పారి శుద్ధ్యము కొఱకై యీక్రింది వివరములు గమనార్హములు.

(1) అనుకూలములును చౌకగ నేర్పాటు చేయుటకు నట్టియు మురుగుకాల్వలను, పైని మూతలేనివైనను త్రవ్వించి, వాని నప్పుడు తుడిపించుచుండుట; స్థానికముగ లభ్యములగు దుర్వాయు హారణద్రవ్యముల నందు చల్లించుచుండుట.

(2) ఇండ్లచుట్టు నుండు తోటలకును పండ్లతోటలకును, కడుగుటకు వీలున్నచోట్ల మఱుగు దొడ్లకును మురుగునీళ్లను నుపయోగించుట.

(3) అన్నివిధములగు మురికి వస్తువులను ప్రోగుచేసి యెఱువుగ మార్చుట.

(4) గ్రామములోని బావులను, కాలిత్రోవలను, చెఱు వులను, బహిరంగ స్థలములను, పరిశుభ్రముగ నుంచ శ్రద్ధ వహించి రోగములు వ్యాపింపకుండ నివారించుచు కాపాడుట.

(5) గ్రామ ప్రజల వినోదార్థమును, బిడ్డల ఆటస్థల ముగ వినియోగపడుటకును తోటలనువేసి పోషించుట; బహి రంగమగు సందుగొందులను పరిశుభ్రపఱచుట.

1. ఆరోగ్యము :—

ఆహారపదార్థసేకరణ :— నిస్సారమగు ఆహారముల దినుట గ్రామములలో నలవాటైపోయినది. గ్రామములలో

దొరకగలట్టియు, సిద్ధముచేయ వీలగునట్టియు పరిపోషకాహారము లందలి విటమినులను గుఱించి గ్రామ వాస్తవ్యులకు నేర్పుట యావసరము. ప్రతి కుటుంబమువారును సమతుల్యాహారమున నేమో తెలిసియుండవలయును. గ్రామములోని పరిస్థితులననుస రించి అట్టి ఆహారమును సంపాదించు టెట్లో వారికి తెలియ పఱచవలయును. అన్ని కేంద్రములందలి ఆరోగ్యశాఖోద్యోగు లును ఈవిషయమున ప్రబోధకార్యక్రమమునకుపూనవలయును. ఆయా కేంద్రము లందలి బియ్యపు మరలను ప్రభుత్వమునాపు సి పేధించుటతో నీ పనిని ప్రారంభించవలయును.

2. పానయోగ్యమగు జలము :—

పానయోగ్యమగు పరిశుభ్రజలమును సమకూర్చుట అత్యంతావసరము. గ్రామములలో నింక చాలబావులుండుట యావసరము. ప్రాతవానిని మరమ్మతుచేయవలసియున్నది. కొన్ని తావులందు పానీయ జలాశయములగు చెఱువులను సంరక్షించి పరిశుభ్రముగ నుంచవలయును. వెంటనే శ్రద్ధచేయ వలయు విషయములలో నిది యొకటి.

3. నివారణోపాయములు :—

రోగముల కుదుర్చు నుపాయములకన్న రోగములు రాకుండ నివారించు నుపాయములు హెచ్చుగ అవసరములై యున్నవి. సమతుల్యాహారము, వ్యష్టి సమష్టి పారిశుద్ధ్యము వినోదములకు వ్యాయామములకు నవకాశములుగల సామాన్య సరోగజీవనము – వీనిం గూర్చి ప్రధానముగ ప్రచారము చేయవలెను.

4. సామాన్యముగవచ్చు వ్యాధులు, చౌకమందులు :—

సామాన్యముగ గ్రామములలో సంభవించుచుండు వ్యాధులను గురించియు వానిని రాకుండజేయు నుపాయముల గురించియు వచ్చును. వానిని మాన్పు మందులను గురించియు ప్రజలకు నేర్పవలయును. ప్రకృతి విధానములను, ఉచితముగా ఓషధులు మొదలగు వానితో సమకూర్చుగల చౌకమందులను గురించియు ప్రధానముగ బోధింపవలసి యుండును. క్రిమిహారములగు చౌకవస్తువులయు ఓషధులయు వినియోగమును ప్రజలకు దెలుపుచు ప్రతి కుటుంబమునకును వానిని అందుబాటులో నుండునట్లు చేయవలయును. ఈ సందర్భమున ఆరోగ్యశాఖవారు విషతుల్యములగు మొక్కలను నాచుపదార్థములను గురించిన పరిశోధనములను గావించవలసి యుండును.

5 వినోదములు, వ్యాయామములు:—

ప్రతి గ్రామమునందును బహిరంగ స్థలములందును వినియోగములు సలుపుకొనుటకును, వ్యాయామక్రీడల జరుపుకొనుటకును అనుకూలమగునట్టి స్థలములను పరికరములను సమకూర్పవలయును. సూర్యనమస్కారములు బోలు వ్యాయామములను, గ్రామీణుల ఆటపాటలను ప్రోత్సహించుటకు తగు సంస్థల నేర్పాటు చేయవలయును.

నివాసపుటిల్లు:—

ఇప్పుడున్న వానికంటె శ్రేష్ఠతరములును, ఆరోగ్యప్రదములు నగు నిండ్లుండుట చాల ముఖ్యము. గ్రామములలోని గృహములు అనారోగ్యకరముగ నున్నవి. వానిలో జనసమ్మర్దము మెండు. సమష్టి నిర్మాణ ప్రణాళిక యనున దేమియు

లేకుండ యిండ్లు కట్టుచున్నారు. గ్రామ పంచాయతీల ద్వారమున సముచితమగు ప్రణాళికల బోధించి యీ స్థితిని మార్పవలయును. పంచాయతీలవారు దాపున అందుబాటులోనున్న ఆరోగ్యశాఖవారి యొక్కయు వాస్తుశాస్త్ర ప్రవీణులయు సలహాలనుగొని పనిచేయు చుండవలయును. ఈ క్రింది యంశములంగూర్చి అధిక శ్రద్ధవహించవలయును.

(1) చక్కని ప్రణాళిక నొకదాని ననుసరించి గృహనిర్మాణమున కనువగు విశాల స్థలములలో గ్రామ విస్తీర్ణములను పెంపుచేసి జనసమ్మర్దమును తొలగించుట.

(2) ఇకమీదట సహకార పద్ధతిని క్రొత్త యిండ్లను కట్టుట.

(3) తగు విద్యాప్రచారము గావించి యిప్పటి దున్న యిండ్ల నభివృద్ధిని చేయుట.

(4) వ్యక్తుల యిండ్లచుట్టును, వీధులందును నీరు నిలువక తొలగిపోవు నేర్పాటులు చేయుట. మొదటి సదుపాయము నీరింకిపోగల గోతులను త్రవ్వి, వానిని పలుమారు శుభ్రపఱచుచు, స్థలాంతరమున త్రవ్వుచు నుండుటచే సమకూరగలదు. రెండవదానిని సులభముగను చౌకగను నేర్పాటుచేసి పోగల నీటికాల్వలను త్రవ్వించి, అవి మూతలేక భూమిపైని తెఱచియుండు నెడల అప్పటి డప్పుడు శుభ్రపఱచుచు, క్రిమిహారణోపాయముల ననుసరించుచు కాపాడుకొదగును. సామాన్యముగ వీని నీటిని కాయగూరల తోటలకును పండ్ల తోటలకును పారునటుల చేసికొనవలయును.

(5) గ్రామములందలి యిండ్లు చిన్నవియు,జనసమ్మర్దము కలవియునై యుంటవలన సమష్టి యుపయోగార్థము కను మఱుగుదొడ్లను, స్నానపు ఘట్టములను, బట్టలుదుకు తావులను నేర్పాటు చేయుట చాల అవసరము.

(6) మలేరియాజ్వరము మున్నగు జాడ్యములు వ్యాపించుటకు మూలములగు మురుగుడు గుంటలను గోతులను వెనువెంటనే పూడ్చివేయుట.

(7) చక్కని ప్రణాళిక ననుసరించి గ్రామవీథులను బావులను రోడ్లనుగూడ ఉన్నవానిని వృద్ధిగావించుట, క్రొత్తవానిని నిర్మించుట.

(8) ప్రభుత్వపు నిర్మాణశాఖ, ఆరోగ్యశాఖలవారు ఆయా గ్రామముల కనుకూలములగు ఆదర్శ గృహములను నిర్మింపుచు ప్రదర్శనముల జరుపుట.

(9) కొన్ని ప్రత్యేక ప్రదేశములందలి ప్రాత గ్రామములను పరిశుభ్ర స్థితికి దెచ్చి ఆరోగ్యవంతములనుగ జేయు వీలు లేనియెడల వానిని క్రమేణా తొలగించి దాపునగల స్థలములను ఉచితముగ నొసగి సహాకార పద్ధతిమీద నార్థికసహాయక ధనముల నిచ్చి నూతన ప్రతిష్ఠాపనల గావించుట.

(10) గృహనిర్మాణమున నూతన ప్రణాళికలు నూతనానోద్యమములు సాగించుపట్ల హరిజనులను వేఱుపఱచి గ్రామముల నుండి దూరముగ నివసింపజేయు పద్ధతిని తొలగించుచు జాగ్రత్తను దీసికొనవలయును.

గ్రామనిర్మాణము:—

గ్రామ నిర్మాణోద్యమమును పూనగల మూడు సంస్థ లున్నవి: (1) గ్రామస్వారాజ్యసిద్ధాంతము ననుసరించు గ్రామ పరిపాలన క్రింద నేర్పాటైన గ్రామ పంచాయతీ. (2) గ్రామ సంబంధమగు ఆర్థికసంస్థా నిర్మాణము చేయగల వివిధప్రయోజక సహకార సంఘము. (3) ఐచ్ఛిక సేవాధర్మముపై నాధారపడు గ్రామోద్ధరణ ప్రణాళికనంతను బలపఱచుకొఱకై అనధికారుల బలమును కార్యోత్సాహమును సంఘటితము చేయగల గ్రామ సేవాసంఘము.

1. గ్రామపంచాయతీ :—

ప్రతిగ్రామమునకుగాని, గ్రామకూటమునకుగాని వయోజన కోటింగు పద్ధతిని నిర్మాణమైన గ్రామపంచాయతీ యుండవలయును. ఇందుకొఱకనువగు తీరున గ్రామములను కొన్ని అంతర్భాగములుగ (వార్డులనుగ) విభజింపవలయును.

గ్రామపురోడ్లు, గ్రామమున నీటిపరిస్థరా, గ్రామవిద్య, గ్రామవైద్యాలయాలు గ్రామపారిశుద్ధ్యము కొంత పరిమితికి లోబడి గ్రామమున న్యాయపాలనము గ్రామమున దీపములు పెట్టుట మొదలగు ప్రజాప్రయోజనముల దీర్చు కార్యముల విషయమున పంచాయతీకి ప్రత్యక్షమగు బాధ్యతయుండవలయును. ఈసేనల కొఱకై వసూలు చేయబడునట్టిగాని నిర్ణయింపబడినట్టిగాని ధనము చాలని యెడ ఆలోటును ప్రభుత్వము భరించవలసియుండును.

గ్రంథాలయములు, గ్రామమందిరములు, ప్రదర్శనశాలలు మొదలైన యింకొకతీరు ప్రయోజనములు గలప్ర

పేనికగు ధనమును కొంత స్థానికముగ వసూలుచేయవలయును; కొంత ప్రభుత్వ మీయవలయును.

ప్రత్యేక ప్రాంతములందుగల పంచాయతీ లన్నింటికిని ఒక పంచాయతీ యూనియనుండవలయును. ఈ పంచాయతీలయొక్క ఆయా ప్రధాన ప్రయోజనములకు అను సంబంధమును గూర్చుటే యీ యూనియను నిర్వహింపదగినవిధి. ఈ యూనియను గ్రామపంచాయతీల కార్యకలాపముల కనుకూలించు మార్గముల సూచించి నడుపుచు సమీక్ష గావించుచు వానికి పరస్పరాను సంధానమును గూర్చుచు, వాని లెక్కలను తనిఖీచేయుచునుండును. ఆ యూనియ నింకను ఆధార విద్యాప్రచారమును (Basic Education) గాని, ఆధార విద్యానంతర బోధనక్రమమునుగాని (Post Basic Education) పూనుకొనును. పెద్దపెద్ద వైద్యాలయములను ప్రసూతి గృహములను నిర్వహించును. యూనియనుకు చెందిన రెవెన్యూ అసిస్టెంటు ఇంజనీయరు కట్టడములకగు అన్ని మదింపులను తయారు చేయును. తత్సంబంధమగు పనుల నన్నింటిని నిర్వహించును.

కేంద్రమండలి పంచాయతీల యొక్క ప్రతినిధులతో యూనియను ఏర్పడును. పంచాయతీల నుండి విరాళములను ప్రభుత్వమునుండి గ్రాంటులను యూనియను తీసికొనుచుండును.

గమనిక :—గ్రామ పంచాయతీలు కేవలము వ్యవహార నిర్వహణము చేయునవిగ నుండుటకంటె హెచ్చైన పనిచేయునవిగ నుండవలెను. గ్రామపౌరస్వత్వములను, బాధ్యతను ప్రతి వయోజనునికి నేర్పుచు, సామాన్య పౌరధర్మ నిర్వహణమున

సుశిక్షణము నొసగుటలో సహకారము సలుపుచుండవలయును. జూదమ్మాడుటవంటి సాంఘిక దురభ్యాసములనుండి ప్రజల సంస్కరించుటకును, అస్పృశ్యతవంటి దురాచారములను తొలగించుటకును శ్రద్ధవహించవలసియుండును.

సాంఘికాన్యాయములకు బలియై కుందుచుండిన ఆదివాసులయు హరిజనులయు వర్గముల వారిని సమష్టి సమాజమున కలిసిపో గల్గునటుల నుద్ధరించు ప్రత్యేక సంస్థల నెలకొలుపవలయును. స్త్రీజనము యొక్క దుర్దశ అంతకన్నను కఠినతర సమస్యగనున్నది. దానినేదో యొక సంస్థగాని, ప్రభుత్వ శాఖగాని పరిష్కరము చేయజాలదు. అందుకొఱకై సమాజమునం దెల్లఱకు ప్రబోధము గల్గించి చిరకాలమునుండి పాదుకొని పోయియున్న మూఢ విశ్వాసముల నిగ్రహించవలసియుండును ఈ యంశముం గూర్చి ప్రత్యేకశ్రద్ధవహింపవలసియుండును. ఈపనిని నిర్వహించుకొఱకు ఆచరణ శీలురైనట్టియు, పాకశాస్త్రము, వైద్యసేవ, నేత, కుట్టుపని మొదలగు గృహధర్మశాస్త్రమున నిపుణతగలట్టియు కొలదిమంది నారీమణులు మిగుల నుపయోగపడుదురు.

2. పలుప్రయోజక సహకారసంఘములు :—

రాజకీయములందును, శాసన పరిపాలనమునందును పంచాయతీలు సాధనములై యొప్పినటుల పలుప్రయోజనసహకార సంఘములు గ్రామముల ఆర్థికవ్యవస్థల నిర్వాహణమున ప్రబలసాధనములై యొప్పగలవు. అవి యీ క్రింది యంశములం దుపకరింపగలవు.

1. గ్రామములోని ఆహారద్రవ్యములను ప్రోవుచేసి, నిలువపోసి యుంచుట.

2. ఆహారద్రవ్యముల యుత్పాదన క్రమము.

3. స్థానికముగ సమకూరగల సమతుల్యాహార పదార్థములను పంచిపెట్టుట, అవసర ద్రవ్యములను దిగుమతిచేయుట.

4. గ్రామ వ్యవసాయమునకును గ్రామ పరిశ్రమలకును అవసరము లగు పనిముట్లను నిలువ చేసియుంచి సరాఫరా చేయుట.

5. స్థానికముగా పరిశ్రమల కుపయోగించు దూది, కలప లోహవస్తువులు మొదలగు వానిని నిలువ చేసియుంచి, సరఫరాచేయుట.

6. సిద్ధవస్తువులను విక్రయించి పెట్టుట.

7. గ్రామములో అదనముగ నుత్పత్తియగు సరకులను అవసరములగు ముడిపదార్థముల కొఱకును సరకుల కొఱకును మార్పిడిచేసి పెట్టుట.

8. మొత్తమున గ్రామప్రజ యంతయు, సాధ్యమగు నంతవఱకు లాభములను నుపకారములను సమానముగ పంచు కొనగల్గు తీరున, అనుబంధములుగ నేర్పడియున్న సహకార సంఘములను సమీకరించి, ప్రధానముగా గ్రామ పరిశ్రమలను సంఘటన పఱచుట. అందుగడలోనున్న మానవశ్రమ పూర్తిగ వినియోగపడి సమష్టిని ప్రజలందఱకు లాభించు వృత్తులగు తీరున జాగ్రత తీసికొనుట. ఇందు ప్రధానాశయము నిరుద్యోగ బాధగాని చాలినంత పనిపాటలు లేని బెడదగాని సంభవించకుండ జూడవలయును.

9. గ్రామశిల్పులకు సహాయపడి, వారిపనులను వృద్ధికి తెచ్చు నిమిత్తము వినూత్న సాంకేతిక విద్యావిజ్ఞానములు గలట్టియు కళాదృష్టి గలట్టియు శిల్పశ్రేష్ఠుల సహకారమును శిక్షణమును చేకూర్చుట. అటువంటివారి బోధనకును, పర్యవేక్షణమునకును నగు వ్యయమును ప్రభుత్వము భరించవలయును.

10. ప్రతిప్రాంతమునకును సుశిక్షితులైన సహకార ధర్మముం దారితేరిన ఇన్‌స్పెక్టర్లు రుండవలయును.

11. లభింపగలంత విజ్ఞానవార్తయు, మార్గదర్శకత్వమును సమష్టిని గ్రామములకును గ్రామవాసులకును సమకూర్చిపెట్టవలయును.

3. గ్రామసేవాసంఘములు :—

గ్రామ పంచాయతులును, పలుప్రయోజక సహకార సంఘములును కలిసి గ్రామ జీవితమును సుసంఘటితము చేయుచుండగ గ్రామసేవా సంఘములతో నిమిత్తమేమను శంక బయలుదేరవచ్చును. గ్రామ పంచాయతీలు పలుప్రయోజన సహకారసంఘములును కొలదిమంది నియమితులైన పురుషులచే నడుపబడుచుండును. ఇతరులగు ప్రయోజను లెల్లరును గ్రామ పునర్నిర్మాణసంబంధమగు నాయా కార్యక్రమములందు నిర్మాణాత్మకమగు కార్యభారమును వహించిననేతప్ప, వారు కేవలము ఆపునర్నిర్మాణప్రణాళికను దూరమునుండి చూచుచు ఫలమునకై నిరీక్షించుచుండు వారైపోదురు. గ్రామసేవా సంఘము లిట్టివి పంచాయతీలయు పలుప్రయోజన సహకార సంఘములయు ధర్మనిర్వహణము నందు వారికి సర్వవిధముల

సాయపడు ఐచ్ఛికసేవాసంస్థలుగ పనిచేయును. గ్రామసీమాభి వృద్ధికై యేర్పాటు చేయబడిన యుద్యోగులును, గ్రామముల యభ్యుదయమునకై నియమింపబడిన యుద్యోగులును, మఱి యితరులును కూడ గ్రామసేవాసంఘముల నిర్మాణము చేయుటందును బలపఱచుటందును, వాని వినియోగమునందును తోడ్పడు చుండవలయును. కాని యీ సంఘములు తమంతట తామే పనిచేయునట్టి సంస్థలుగ నుండి తమ కనుకూలమగు నిర్మాణమును, నిబంధనలను ధనమును కలిగియుండవలయును. ప్రభుత్వమువారు వీరికి గ్రాంటుల నీయవచ్చును గాని, వారి స్వతంత్రకార్యనిర్వాహకమునకు ప్రతిబంధములు కలిగింపదగదు. గ్రామసేవాసంఘములు గ్రామ పారిశుద్ధ్యరక్షణకై ఐచ్ఛికసేవా బృందముల నేర్పాటు చేయవలయును; గ్రామములందు జరుగు సభలను నుత్సవములను సక్రమముగ నడుపు సంఘముల నేర్పాటు చేయవలయును. గ్రామములందలి ధన ప్రాణరక్షణ కును, అంటు వ్యాధులు, వరదలు మున్నగు అవాంతరములు వచ్చిపడు తరుణములందు అవసరములగు ఆయా సేవాప్రయోజనములకును తగిన యేర్పాటులు గావింతురు. నిజానికి ప్రభుత్వము క్రిందను, పంచాయతీక్రిందను పలుప్రయోజన సహకార సంఘము క్రిందను, జీతములు పుచ్చుకొను ఏ సేవకుని కంటెను ఎన్నియోరెట్లుగ గ్రామసేవాసంఘమువలన శిక్షణపొందిన, ఐచ్ఛిక గ్రామసేవకుడు స్థానికముగ సంసిద్ధముగ దొరక గలిగి యుండవలయును.

గమనిక:—గ్రామనిర్మాణమునకు సాధనభూతము లగు మూడు అంశములుగ గ్రామపంచాయతీలను, పలుప్రయోజన

సహకార సంఘములను, గ్రామ సేవాసంఘములను ప్రస్తావించి యున్నాము. కాని గ్రామ నిర్మాణమునకు పరమలక్ష్యము అగునది తిండి బట్ట మఱియు నితరములగు గ్రామజీవన ముఖ్యావసరముల సందర్భమున ప్రతి గ్రామము స్వయంసమృద్ధమై వెలయగావలయు ననుటే. సాధ్యమగునంతవఱకు గ్రామజీవనమునకు పునాదిగ ప్రతి గ్రామము స్వయం సమర్థముగను స్వయంపోషకముగ నుండవలయును. ఇదంతయు ప్రజాస్వామ్య సిద్ధాంతము ననుసరించియు, శాంతిమయ మార్గము నవలంబించియు సాధింపవలసియుండు పని.

గ్రామ సంస్కృతి :—

గ్రామ సంస్కృతి యీనాడు చాలగ నుపేక్షలో పడి పోయినది. గ్రామ సంస్కృతియొక్క గట్టి అండలేనిది గ్రామ స్వారాజ్యముగాని, గ్రామ స్వయం సమృద్ధిగాని యథార్థమనుటకు వీలులేదు; సుస్థిరములును కాజాలవు. దీర్ఘకాల పరీక్షకు తట్టుకొని నిలునబడియున్న భారతదేశము పలు శతాబ్దములుగ విశిష్టరీతి గ్రామసంస్కృతిని పరిణతికి దెచ్చి యున్నది. ఆ సంస్కృతిని పునర్దర్శనము గావించి దాని ప్రయోజనమును గుర్తించి, అభ్యుదయము చేసుకొనవలసి యున్నది. గ్రామ జీవనమునకు సౌందర్యమును సత్యమును చేకూర్చుచు ఆ సంస్కృతికి వారసురాలై ముఖ్యముగ గ్రామ మహిళాజనము చెన్నారుచున్నది. "గ్రామవాసియగు ముత్తవ తన యనుభవ పరిజ్ఞానముతోడను, జీవనరహస్య విజ్ఞానము తోడను ఏ విశ్వవిద్యాలయ పట్టభద్రుడైనను లజ్జతో జంకజేయ గలద"ని పల్వురు చెప్పుకొనుచుండుట గలదు. అట్టి గ్రామ

సంస్కృతికి లక్షణమగు పరిపోషణను గుఱించి యీ క్రింది సూచనలచేయ వాంఛించు చున్నాము.

(1) గ్రామ సంప్రదాయములను, ఆచారములను, వ్యవస్థలను, చరిత్రను పరిశోధించుట.

(2) పల్లెటూరు కథలను, కళలను, గీతములను పరిశీలించుట.

(3) కళావిసౌందర్య విలసితములగు గ్రామ పరిశ్రమలను గ్రామ చిత్రలలిత కళలను పునరుద్ధరించి వృద్ధికి దెచ్చుట.

(4) భజనలను, కీర్తనలను, వీథినాటకములను గ్రామ విద్యాప్రచారము నిమిత్తము సుసంఘటనము చేయుట.

(5) కులవర్గ విభేదములు పాటింపకుండ గ్రామజీవన సమైక్యతను వృద్ధిపఱచు గ్రామోత్సవములను మతసంబంధమగు తిరుణాళ్ళను నేర్పాటు చేయుట. వేర్వేఱు మతములకు చెందిన ప్రజలు, ఇతర మతస్థుల పండుగలందును, మతమహోత్సవములందును వేడుకలందును పాల్గొనుచు సమష్టిని ఆనందపడుటను ప్రోత్సహించుట.

(6) గ్రామ పుస్తకాలయములను, వస్తు ప్రదర్శనాగారములను, పఠనమందిరములను నేర్పాటుచేయుట.

(7) ఆటలు, నాట్యములు, సృష్టిపరిశీలన యాత్రలు మొదలగు బహిరంగ వినోదములను, ఆరోగ్యప్రచారములను నేర్పాటు చేయుట.

గమనిక :—గ్రామ సంస్కృతిని పునరుద్ధరించు సందర్భమున పనిచేయు సంస్థలు నిర్మాణ నిపుణతకలవిగ నుండవలెను.

వ్యక్తిగతముగను నూతన సమాజమున నొక యంగముగను గ్రామజీవితమును శాసించు ప్రయోజనములందు గౌరవప్రపత్తులను పెంచ్చించు నాదర్శమును కూర్చునవిగ నుండవలయును.

## అధ్యాయము 11

## పురోగామి సంఘములు

శాశ్వత పరిపోషణమును సమకూర్చునట్టుల రచనకాగల జీవితముయొక్క వివిధాంశముల చింతనలకును విశదీకరించి యున్నాము. దేశము నేతీరునసంఘటితము చేయనగునో సూచించియున్నాము.

ఇందు మనను కృతకృత్యుల జేయగల పరిశోధనాగారమోయన నొప్పు నొక సంస్థ మనకవసరమగును. ప్రచారకులకు శిక్షణ మొసగదగు క్షేత్రముగ నది యుపకరింపగలదు. కాబట్టి ఒక గ్రామమునుగాని, గ్రామముల సమూహమునుగాని ఒక ప్రాంతముగ దీసికొని, ఇదివఱకే వివరింపబడియున్న పద్ధతుల ననుసరించి, ఆ క్షేత్రముననో లేక ఆ ప్రాంతముననో, సర్వతోముఖముగ పనిని ప్రారంభింపవచ్చును. అందుకొఱకు వేర్వేఱు సంఘముల నిర్మింపవచ్చును. అందొక్కొక్క సంఘమును తాను స్వతంత్రమగు ప్రజాప్రభుత్వమువలె వ్యవహరించుచు, గ్రామ జీవనమున నాయా వ్యవహారాంశములను తానే నిర్వహించుచుండ నగును. వీనిని సామాన్యప్రణాళిక ననుసరించి "వర్తించు లోకసేవాసంఘముల"న నచ్చును.

అటువంటి సంఘములు సంపూర్ణ స్వాతంత్ర్యదక్షతతో పనిచేయునపుడు ప్రభుత్వములందు ప్రతిపక్షస్థానమును వహింప దగును. ఏలయన ప్రభుత్వము తన పరిపాలనా ధర్మమునే యే విధముల నిర్వహింపదగునో, యీ సంఘములు నిర్ణయించుచు దానిని అదుపులో నుంచగలవు.

స్పర్థమూలకమగు ఆర్థికసంప్రదాయమవలంబించు ప్రభుత్వ కార్యనిర్వాహకశాఖ ప్రతిపక్షము చేత అదుపులో నుంచబడి, నడుపబడుచుండును. కాని మనము సంకల్పించుచున్నట్లు, సత్యాహింసలపై నాధారపడి నడుచు ఆర్థిక సంప్రదాయమందు ఆ తీరు ప్రతిపక్షముండబోదు. ప్రభుత్వ దృష్టిని మనము సూచించు కార్యవిధానమునకై ఆకర్షించి, ప్రభుత్వము చేపట్టు కార్యక్రమములందు మన ప్రణాళికల ననువర్తించు నటుల చేయుటయే మన యుద్దేశ్యము. మన సంస్థలు ముఖ్యముగ అనేక కేంద్రములలో నెలకొలుపబడును. తుదకవి సమ్మేళి నమై లోకసేవాసంఘముగ పరిణమిల్లును. దీనిశక్తి అమోఘ ముగ నుండును. ప్రభుత్వము దానిని నిర్లక్ష్యముచేయజాలదు. ఈ సంఘము ప్రతిపాదించు నీతి జాతీయ శాసనసభలందు గొప్ప వప్రభావముగలదై యొప్పును.

ఈ సంఘ నిర్మాణముం గురించి యీక్రింది సూచనల గావించెదము గాక :

మంత్రాంగ సభ :—

లోకసేవా సంఘమునందు అధ్యక్ష కార్యదర్శులతో సహా సుమారు తొమ్మండుగురు సభ్యులుగల మంత్రాంగసభ యొక

యుండును. అధ్యక్ష కార్యదర్శులు కాక తక్కిన సభ్యులు ఆయా శాఖలకు సంబంధించిన పరిపాలనాబాధ్యతాధికారముల వహించి ఆయా శాఖలకు సంచాలకులుగ నుందురు. అట్టి శాఖ లెవ్వి యన: 1. ఆరోగ్యము, 2. విద్య, 3. ఆర్థికవిభాగము (Economic Sector) 4. రాజకీయవిభాగము, 5. సాంఘిక విభాగము, 6. ప్రకటనలు.

సంచాలకసభ :—

మంత్రాంగసభలో యీ శాఖల నిర్వహణమునందు అనుసరింపవలసిన నీతిని సంచాలకులు నిర్ణయింతురు. కార్య నిర్వహణమున నీ సంచాలకులు తమ తమ శాఖలందు స్వాయ ముగ సలహాకూటముల నేర్పఱచుకొని పనిచేయుదురు. సంచా లకుల సలహాకూటములందు వారివారి శాఖలకార్యకలాపములం గూర్చి నిపుణులగు సాంకేతిక విద్యా విశారదులను నియమించు కొందురు.

ఉదాహరణకు ఆరోగ్యసలహా కూటమునందు ఆహార శాస్త్రనిపుణుడగు మంత్రియొకడు, శిశువులయు నితరులయు క్షేమము నరయగల మంత్రి యొకడు, పారిశుద్ధ్యము మొద లగు ధర్మముల నరయగల మంత్రియొకడు నుండును. ఇటులనే ప్రతిశాఖకును నొక సలహా కూటము లేక మంత్రివర్గముండును. అందు ప్రవీణులగు మంత్రులు నుందురు. వారి యందఱిపైనను నా యా సంచాలకులు అధ్యక్షత వహించుచుందురు.

మంత్రివర్గము :—

రాష్ట్ర లేక ప్రాంతీయ ప్రతినిధులతో గూడిన యీ మంత్రివర్గములకు అండగ సాంకేతిక ప్రవీణుల ఉపసంఘము

లుండును. ఉదాహరణకు ఆహారశాఖాపర్గమునందు ఆహార విషయముల విచారించు కేంద్రమంత్రియు, దేశము నంతటి లోకసేవాసంఘములయొక్క రాష్ట్ర లేక ప్రాంతీయ సంస్థలకు చెందిన ఆహార ధర్మప్రవీణులు నుందురు. ప్రవీణులనర్గ మిటుల తమతమ శాఖాపాలనమును గూర్చిన అనుభవముగల నిపుణు లతో సంప్రదింపులు చేయుగల్గుదురు.

ఇట్టి వ్యవస్థలే ఆయా ప్రాంతములందును పని చేయుచుం డును. ఇటువంటి సంస్థలు దేశమునందెల్లెడల వ్యాపింపించి యుండవలయును. అవన్నియు సుసంఘటితమైన కార్యక్రమమును సాగించుచుండును.

సంచాలక ప్రతినిధిసభ :—

కేంద్ర లోకసేవా సంఘమంత్రాంగసభ, అప్పుడప్పుడు సంచాలక ప్రతినిధిసభను సమావేశము చేయుచుండును. అందుకు రాష్ట్ర లేక ప్రాంతీయ లోకసేవా సంఘము లన్నింటినుండి ప్రతినిధుల నాహ్వానించి తామనుసరించు సంఘమునకు సంబంధించిన చర్చలను జరుపును.

ఇదే తీరున సాంకేతిక విద్యానిపుణుల సమావేశ మొకటి యుండి అందు వారు గడించిన అనుభవమును గురించియు విజ్ఞానమును గురించియు పరస్పరము చర్చించు కొందురు. ప్రతి ప్రభుత్వశాఖయందును మంత్రులును సాంకేతిక ప్రవీణు లయు నిట్టి సమావేశములు జరుగుచుండును.

విద్య :—

ఉదాహరణకు విద్యాశాఖ అధీనమున ఆయా తాలిమీ సంఘములు ప్రచారము చేయుచున్న ఆధారవిద్యకు పూర్ణదశ

యందును ఆధారవిద్యాదశయందును గఱపబడు శిక్షణమును గుఱించిన చర్చలు జరుగును. ఇంకొక శాఖ అధీనమున హిందూస్థానీ ప్రచారము నడుచును. మఱియొక శాఖ అధీనమున ఆధార విద్యానంతర దశయందు గఱపబడు విశ్వవిద్యాలయ శిక్షను బోలు వృత్తి, వ్యాపారముల సంబంధమగు శిక్షణయు పరిశోధన కార్యకలాపములును నడుపు విద్యాపీఠములుండును. ఆయా నిర్మాణ కార్యక్రమ దశలందుచేరి పనిచేయ సమర్థులగు వారిని ఏర్పుకొని (Recruit) వారికి తగు శిక్షణ నిప్పించు బాధ్యతను ఇట్టి విద్యాపీఠములు వహించును. తాలిమీసంఘములే యీ విద్యాపీఠముల కాధారములుగ నుండగలవు.

ఆర్థికవిభాగము :—

రాజకీయ, ప్రచారకశాఖలతోసహా, వ్యవసాయము గ్రామోద్యోగము, పలుప్రయోజన సంఘములు ఆర్థికవిభాగము యొక్క అధీనమున నడుచును.

వ్యవసాయశాఖ వ్యవసాయక వృత్తులకు సంబంధించిన విషయముల నన్నింటిని, వానిలో స్వయంసమృద్ధతను సాధించుటను విచారించుచుండును. ధనప్రయోజనపు పంటలవంటి వస్తుమార్పిడి కొఱకగు ఉత్పత్తిలో ముఖ్యసంబంధముగలది వృత్తి విషయము. రెండవది (స్వయం సమృద్ధి) వినియోగము కొఱకగు ఉత్పత్తితోడ సంబంధము గలదై, కూరగాయలు పండ్లు నగైరాలను పెంచు తోటల ప్రమేయమును చూచుచుండును.

జంతుపాలనము :—

పశూత్పత్తి, గోత్రాల పెంపకము, మేకల పెంపకము, మఱియు పట్టు పురుగుల పెంచుట, చేపలవృద్ధి మొదలగు అను

బంధవృత్తులతో జంతుపాలన శాఖకు సంబంధము గలిగియుండును. ఈశాఖలోనే కుటీరపరిశ్రమలు, పాడి పంటకమును చేర్పవచ్చును. దీనితోపాటు అనుబంధ వృత్తిశాఖను విచారించవచ్చును. ప్రాథమికావసరముల సంబంధముగా ఆర్థికవిభాగము జరుగగల కొమ్మువనులు, తోళ్ళపనులు, సరేసును, నరములను తయారు చేయుట మున్నగు వానియందున్న శ్రద్ధ దీనిలో నగును.

గ్రామోద్యోగము :—

వ్యవసాయశాఖలో సన్నిహిత సహకారముగల ఆహారోత్పత్తిని ప్రథమముగ శ్రద్ధవహించుట గ్రామోద్యోగము. వస్త్రోత్పత్తి, సబ్బులు, కాగితము, మృణ్మయపాత్రలు, తోళ్ళ పరిశ్రమ మొదలగు ప్రాథమికావసరముల సమకూర్చుచు సహయోగదారుని క్షేమలాభముల నింకొక శాఖ గూర్చుచుండును.

పలుప్రయోజన సహకారసంఘములు :—

ఉత్పత్తిదారులకును వినియోగదారులకును సహకారానుబంధమును గూర్చుచు, పంపిణీదారుల వ్యవహారమును గూడ నివి నిర్వహించుచుండును. అవి ముడిపదార్థములను సేకరించి ఉత్పత్తిదారులకు పంచియిచ్చి తయారైన వస్తువులను ప్రోవుచేసి వానిని అమ్మకము చేయును. అవి పనులు సాగుటలో తోడ్పాటు చేయునుగాని, డబ్బు రూపమున సహాయము చేయుట కంతగ ప్రయత్నింపవు

రాజకీయ విభాగము :—

ప్రజల ఆర్థిక వ్యాపారమునకును ప్రభుత్వమునకును సంధానము కూర్చుటకు వినియోగపడును. ఈ శాఖాకార్య

దర్శి ప్రజలకును ప్రభుత్వముననును సమాధానము కుదుర్చు, ఉద్యోగిగ పనిచేయగలడు. ప్రజాక్షేమముునకై కీలక పరిశ్రమలను అదుపులో పెట్టుచు జాతీయ సేనకాగణము సక్రమముగ పనిచేయునటుల జాగ్రత్త దీసికొనుచు అవసరమగునప్పుడెల్ల, రాష్ట్రీయ ప్రభుత్వము తోడను కేంద్రప్రభుత్వము తోడను అతడు సంప్రదింపులు సాగించుచుండును.

ఈశాఖయొక్క మఱొక భాగము ప్రచారకార్యమును జరుపుచుండును. విద్యాపీఠము వారి పరిశోధనశాఖవారు సమకూర్చిన విషయములను, మఱియు ఇతరవిషయములను, అంకెలను విచారించుచు ప్రజల యుపయోగార్థము వెల్లడిచేయుచుండును. ఈ భాగము ప్రభుత్వపు ప్రకటనశాఖతో సన్నిహిత మైత్రి నలుపుచుండును.

రాజకీయ విభాగము :—

ఈ విభాగములో గ్రామ పంచాయతీ వ్యవస్థలను తదితర రాజకీయసంఘములను నిర్మాణముచేయు బాధ్యతగల శాఖయొకటి, మఱియు రాష్ట్రీయ కేంద్రప్రభుత్వములతో మైత్రి గల్గియుండ వలసిన విశేష విజ్ఞానావసరములుగల శాఖ యొకటియు నుండును. ఇయ్యది ఆర్థిక విభాగము నందలి సమాధానోద్యోగితో సన్నిహితముగ నుండి వ్యవహరించును.

సాంఘిక విభాగము :—

ఇందీ క్రింది శాఖలు పనిచేయుచుండును. 1. వర్గసమైక్యత 2. హరిజనోద్ధరణ; నిమ్నజాత్యుద్ధరణము. 3. వ్యవసాయ శ్రామికులయు నితరులయు సమాజముల నిర్మాణము. 4. జాతీయ

సేవకొఱకై యువకులకును, ఐచ్ఛిక సేవకులకును నొసగబడు శిక్షణము. 5. స్త్రీ జనాభివృద్ధి నిరోధముల తొలగింపు.

ప్రచారశాఖ :—

శాశ్వత ప్రయోజనముగల ప్రచారణ గ్రంథములను పాఠ్యగ్రంథములయు ప్రచురణము; ఆయా కార్యనిర్వాహణశాఖల నొండొంటితో సమన్వయపఱచు పత్రికల సంపాదనాధికారము వహించి వానికి ప్రపంచ మంతటితోను మైత్రి నెరపుట యీ శాఖయొక్క విధులు. ఈ శాఖలో నవజీవననిధి పరిపాలకులు ప్రముఖస్థానము వహింపవచ్చును. 'హరిజనపత్రిక' 'లోకసేవక పత్రిక'గ రూపాంతరము పొందవచ్చును. ఎల్ల గ్రామాణకార్య నిర్వాహకులకును గాంధీజీ ఆదేశము నందజేయుచుండును.

సమీక్ష :—

ఈ ప్రణాళిక బహువిశాలమై గాన్పింపవచ్చును. కాని ఆచరణయందు సరళమై తోచును. ఆయా లోకసేవకసంఘములు 25 లేక 30 వేల జనాభాగల 15 లేక 20 గ్రామసమూహములను తమతమ కార్యకలాపక్షేత్రములుగ జేకొనుచు పై వివరించిన తీరున తమ కార్యక్రమములను సాగించిన కేంద్రీకృతము చేయవచ్చును. ఈవిధముగ నిట్టి సంస్థలను ప్రజలసహకారముతో నడుపుటలో సంపాదించిన యనుభవము ప్రజలకు సమష్టిప్రజావ్యవహారములలో చక్కని పాఠముల నేర్పుటేగాక ప్రభుత్వ చర్యకొక యాదర్శమును సిద్ధముచేసి పెట్టును. మఱియు ప్రజాసామాన్యమునకు స్వరాజ్యఫలితములను పూర్తిగ ననుభవించు పంథా నొకదానిని సిద్ధము చేసిపెట్టును.

లోకసేవక సంఘసభ్యుల ప్రమాణ పత్రము:—

(1) లోకసేవక సంఘనిర్మాణ నిబంధనావళిని చదువుకొని, అందుసభ్యుడ కాగోరుచున్నాను. ఈశ్వరానుగ్రహముతో గ్రామములలోని పేదప్రజల యిక్కట్టులబాపు సేవ యనెడుదాని యుద్దేశ్య నిర్వాహణమున నా శక్తి సామర్థ్యముల యుత్తమాంశమును అందుకై వినియోగింప వాగ్దానము చేయుచున్నాను.

(2) నా యావచ్ఛక్తికొలది యీ సంఘము యొక్క ఆదర్శముల కనుగుణ్యముగ జీవింప యత్నింతును.

(3) రాజకీయములలోని అభిప్రాయ భేదముల పాటింపక నావిధుల నిర్వహించుపట్ల తమసాహాయ్య సహకారములనొసంగ నిష్టముగల వారందఱి సహాయసాహాకారముల నన్వేషించెదను.

(4) లోక సేవాసంఘము ఆజ్ఞాపించినను నియమించినను తప్ప నేను రాజకీయములందు పాల్గొనను. ఏశాసన సభకైన ఎన్నికకు నిలువుమని ఆజ్ఞాపించిన యెడల లోక సేవా సంఘము తన ప్రచారకుల కంగీకరించునంత సొమ్ముతోడనే జీవింపుచు నేనేని మిగులునెడల లోకసేవా సంఘమున కర్పింతును.

(5) నేను స్వయముగ నడికిన నూలుతో తయారుచేసినట్టిగాని, లేక అఖిలభారత చర్ఖాసంఘముచే ధృవపత్రము పొందినట్టిగాని, ఖద్దరునే నిరంతరము ధరింతును. గ్రామపాత్రమలందుత్పత్తియైన వస్తువులను తదితరమైన వానికన్న హెచ్చుపట్టాదలతో వినియోగింతును. అన్ని రకాల సారాయములను నిషేధింతును. నేను స్వయముగను, నాకుటుంబమునందును,

ఏరీతిని ఏరూపము ననుకూడ అస్పృశ్యతను పాటింపను. అంత ర్వర్ణ సమైక్యతా ధర్మమునందు విశ్వాసము ఉంచెదను. సర్వ మతములను ఆదరించి గౌరవింతును. జాతిమత లింగభేదము లెంత మాత్రమును పాటింపక యెల్లరకును సమానావకాశము లను సమాన గౌరవము నిచ్చుటకు సమ్మతింతును.

సంతకము.

ప్రజలను సమష్టి ప్రజాకార్యములం దుత్సాహమును పురిగొల్పుచు దేశము నందెల్లెడల నిట్టి నిర్మాణముగల లోక సేవాసంఘములు నెలకొన వలెను. జాతీయ పోరాటమున అధిక తరబాధ్యతలను పూనవలసియుండు రాజకార్య నిర్వాహ కులకు ఈ సంఘములు శిక్షణ కేంద్రములుగ నుండగలవు.

ఇట్టి వ్యవస్థను సంస్థాపించుటకు దేశము సంసిద్ధపడ వలెను, అహింసా సత్యములపై నాధారపడు సంఘమునది మన స్ఫూర్తిగ నాశ్రయించు వలెను. ఆర్థికముగగాని సాంఘికముగ గాని, రాజకీయముగగాని జీవితమున నేలాటి సుస్థిరతయు లంభింపబోదు. నేటివలె స్పర్థపైనను పారిశ్రామిక కేంద్రీకరణము పైనను ఆధారపడు వ్యవస్థాపన తఱచుగ సంఘటిల్లు భీకర విప్లవ ములకే దారితీయును. నిర్దిష్ట పరమావధికై సుస్థిరగమనముతో జాతులు సాగిపోవలయు నంటినేని యిట్టి విప్లవములు గతినుండి తొలగిపోవలయును. అప్పుడు జాతులమధ్య శాంతియు, పౌరు లకు అభ్యుదయమును సంప్రాప్తింప గల్గును.

అటువంటి స్థితియందు మాత్రమే దుర్బలులకు సామాన్య జనునికి న్యాయమును లభ్యము కాగలదు.

అందు పశుబలము ధర్మముగ గణనగాంచఁజాలదు. మోసము, పీడనము పాటియై సాగవు. అటువంటి సమాజము అన్యాయార్జిత విత్తముతో శోభిలఁజూడదు. ఒక్కసారిగ నాకాశమున కెగురవలయు ననుదురాకాంక్ష యేరికి నుండదు. నరుని వనచరుని దశనుండి యుద్ధరించి, మానవునికి లక్షణమగు మాన్యతరశీలము నొసగు సుస్థిర సంస్కృతి కగు ఉద్గమనము సాగును. ఇందుకు హెచ్చగు స్వయంశిక్షణమును, ఆత్మనిగ్రహమును అవసర సాధనములై పఱగును. ఇయ్యవి పుష్కలముగ లభించి, తద్ద్వారమున మనము శాశ్వత పరిపోషణమును ప్రాపింతుముగాక యనుట మాదు మహదాశయమై యున్నది.



మహతీ ప్రెస్, తెనాలి.